# ★ అస్సాం భూకంపం ★



[illegible] భూకంపంతో ఆ ప్రాంతాన అనేక బీభత్సాలు, విపరీతాలు జరిగాయి. లోయలు పుట్టుకొచ్చాయి, గుట్టలు చదునైపోయాయి. అటువంటివాటికి ఇదొక తార్కాణం. ఎంతో గొప్ప కర్మాగారంగా పేరుపడిన [illegible] టేయాకు ఎస్టేటు కర్మాగారం భూకంపం దెబ్బతో నేలలో కూరుకొనిపోయింది



అస్సాం భూకంపంలో నష్టపడి, రవాణా రహదారులుకూడా బందయిపోయిన ప్రాంతాలకు ఆహార సరఫరాలను, తదితర అవసరవస్తువులను విమానాలలో చేరవేసిన వైమానికులదళం.

# ఆంధ్రపత్రిక


సంవత్సరచందా
రు. 12-0-0

విడిప్రతిక
4 అణాలు

## ప్రతిబుధవారము ప్రకటింపబడును

ఒరులేయవి యొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము **43**

సంచిక **2**

వికృతి సంవత్సర భాద్రపద శుద్ధ నవమి బుధవారము





సహకారభారం:—దేశంయొక్క ఆర్థిక వ్యవస్థను సమానమైన అంతస్తున ఉంచడంలో ప్రభుత్వంతో సహకారం నెరపవలసిందిగా హరికృష్ణ మెహతాబ్ గారు వ్యాపారులను కోరారు. (నేషనల్ హెరాల్డు)



ఆంధ్రపత్రిక

1950-వ సం॥ సెప్టెంబరునెల 20-వ తేది బుధవారము

# టాండన్ ఎన్నికపై ప్రధానమంత్రి ప్రకటన

---

'నాసిక్ కాంగ్రెస్ మహాసభ అధ్యక్షుని ఎన్నికపై ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ చేసిన దీర్ఘప్రకటన కేవలము ఒక శస్త్ర చికిత్సా ప్రవీణుని శవపరీక్షానివేదికవలె నున్నది. పురుషోత్తమ దాస్ టాండన్, ఆచార్య కృపలానీ, శంకర్రావ్ దేవ్ గార్లు కాంగ్రెస్ అధ్యక్షతకు పోటీచేయు పరిస్థితులు ఏర్పడుటకు కాంగ్రెస్ అధిష్ఠానవర్గసభ్యుడుగ పండిట్ నెహ్రూకూడ కొంత బాధ్యత వహింపవలసి యున్నది.

కాంగ్రెస్ అధ్యక్షుడుగ పురుషోత్తమదాస్ టాండన్‌గారు ఎన్నికైనందుకు దేశమునందలి ప్రతీప వర్గములు హర్షమును వెలిబుచ్చెనని పండిట్ నెహ్రూ వెల్లడించెను. ఇందువలన టాండన్ అభ్యర్థిత్వమును బలపరచినవారు ప్రతీపవర్గములకు చెందినవారే నని భారత ప్రధాన మంత్రి భావమైనట్లు స్పష్టమగుచున్నది. పండిట్ నెహ్రూ ఈ విషయమును అధ్యక్ష ఎన్నిక అయిన రెండు వారములకుగాని గ్రహింపలేక పోయెనా? లేక ప్రతీపశక్తుల ప్రతినిధి పురుషోత్తమ దాస్ టాండన్‌గారు ఎన్నిక కాకుండ చేయగల శక్తి భారత ప్రధానమంత్రికి లేకపోయెనా?

1948 వ సంవత్సరములో జయపూర్ కాంగ్రెసు మహాసభాధ్యక్షతకు పురుషోత్తమదాస్ టాండన్‌గారు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారితో పోటీచేసియుండిరి. పండిట్ నెహ్రూ భావన సహేతుకమైన, అప్పటినుండియె కాంగ్రెసుసంస్థను స్వాధీనము చేసుకొనుటకు దేశమునందలి ప్రతీపశక్తులు తీవ్రముగ ప్రయత్నించుచుండవలెను. జయపూర్ కాంగ్రెసు నాటినుండి వీరు ప్రయత్నించుచు, నేడు వారి ప్రయత్నములు ఫలప్రదమైన, ఈ రెండు సంవత్సరములలో ఈ ప్రతికూలశక్తులు విపరీతముగ బలపడియుండవలెను. భారత ప్రభుత్వముగాని, కాంగ్రెస్ మహాసంస్థగాని ఈ పరివర్తనమును నివారింపలేకపోయెనని, ప్రధాన మంత్రి ప్రకటన తెల్పుచున్నది. అందుకు పండిట్ నెహ్రూ తన బాధ్యత ఏమీ లేదని చెప్పజాలడు

టాండన్ విజయము దేశానర్థదాయకమని పండిట్ నెహ్రూ మనస్ఫూర్తిగ విశ్వసించియుండిన కాంగ్రెసు అధ్యక్షతకు టాండన్ ఎన్నిక కాకుండ చూడవలసియుండెను. అధ్యక్షుని ఎన్నిక జరుగుటకు పూర్వము పండిట్ నెహ్రూ ఆచార్య కృపలానీ అభ్యర్థిత్వమును, సర్దార్ పటేల్ పురుషోత్తమదాస్ టాండన్‌గారి అభ్యర్థిత్వమును బలపరచుచున్నట్లు ప్రచారము జరిగెను. పండిట్ నెహ్రూగాని, సర్దార్ పటేల్‌గాని ఎన్నికలకు పూర్వము తమ అభిప్రాయములను ప్రకటించి యుండలేదు. 1947 నుండి 1950 ఆగస్టు 29 వరకు ప్రభుత్వము - కాంగ్రెస్ సంబంధములను గమనించినవారికిగాని, కాంగ్రెసు అధ్యక్షుడుగ డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు ఈ సంబంధమునుగురించి చేసిన ప్రకటనల పరిశీలించినవారికిగాని, కాంగ్రెసు అధ్యక్షునకు ప్రభుత్వవిధానమును మార్చివేయగల అధికారము ఉండునని భావించియుండరు.

భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికకు అంతర్జాతీయ ప్రాధాన్య మున్నదని ఆ స్థానమును ఆక్రమించినవారుకూడ భావించియుండరు. నాసిక్ ప్రతినిధులలో హెచ్చుమంది ఈ వివిధ సమస్యలను పరిశీలించి, అన్ని అంశములను విచారించి టాండన్‌గారిని ఎన్నుకున్నారని అభిప్రాయపడుటకు వీలులేదు. పోటీ

చేసిన ముగ్గురు నాయకులలో శంకర్రావ్ దేవ్ గారు ప్రతినిధుల దృష్టికే ఆనలేదు. వీరికి వచ్చిన రెండువందల వోట్లు ఈ విషయమునె ప్రకటించుచున్నవి. ఇక ఆచార్య కృపలానీ మీరట్ కాంగ్రెసుకు అధ్యక్షుడుగ ఎన్నికై చివరిదాకా ఉండలేక, కేంద్రమంత్రులతో ఏకీభవింపలేక అధ్యక్షపదవికే రాజీనామా నిచ్చిరి. కనుక వారీనాడు తమకు మంత్రులుగ నున్న కాంగ్రెసు అగ్రనాయకుల సహకారము సంపూర్ణముగ నున్నదని ప్రకటించినను, కాంగ్రెసుప్రతినిధులు కృపలానీగారి ప్రకటనను అంగీకరింపలేకుండిరి.

టాండన్ గారు గత సంవత్సరము డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారితో పోటీచేసిరి అప్పుడుకూడ పురుషోత్తమదాసు అభ్యర్థిత్వమును సర్దార్ పటేల్ ఆమోదించెనను ప్రచారము జరిగెను. తిరిగి ఈ సంవత్సరము వారు పోటీచేయగ కాంగ్రెసుప్రతినిధులు వారినే ఎన్నుకొనుటకంటె చేయగల దేమియు లేకుండెను.

ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ప్రకటనను బట్టి పురుషోత్తమదాసు టాండన్ గారి ఎన్నికవలన కాంగ్రెసు విధానమును విస్పష్టముగ ప్రకటింపవలసిన అవసర మేర్పడినది. కాంగ్రెసు దేశీయవిధానమునందు మార్పువచ్చిన, విదేశాంగవిధానము కూడా తదనుగుణముగ మార్పు చెందవలసియుండును. కాని టాండన్ ఎన్నికవలన దేశాంగవిధానము ఎంతవరకు మార్పు చెందునను ప్రశ్నకు సర్దార్ పటేల్ మాత్రమే సమాధానమివ్వగలరు. ఆవిధముగ పండిట్ నెహ్రూ-సర్దార్ పటేల్ విధానములు ప్రస్తుతము భిన్నముగ నున్నవని, ఇక ముందు ఈ విధానములలో ఏ విధానము కాంగ్రెసుకు, భారత ప్రభుత్వమునకు అనుసరణీయమో నిర్ధారణకావలసిన సమయము ఆసన్నమైనట్లు గ్రహింపవలసియుండును. ఈ ఎన్నికవలన నెహ్రూ-పటేల్ విభేదములు తీవ్రమైనవనుభావము ప్రజాసామాన్యమునందు కలుగుట సహజము. నేడు భారతదేశమునకు ఈ స్పర్ధలు, విభేదములకు మించిన మహా ప్రమాదము వేరొకటి లేదు. కొందరు స్పర్ధలను లెనిన్ మరణానంతరము స్టాలిన్ ట్రాట్‌స్కీలమధ్య ప్రబలిన విభేదములతో పోల్చుటకూడ జరుగుచున్నది. ఈ భావముల వెంటనే అరికట్టకపోయిన కాంగ్రెసు సంస్థ పూర్తిగ విచ్ఛిన్నమైపోవుటె గాక దేశమునందు సుస్థిర ప్రభుత్వ స్థాపన కూడ సాధ్యముగాదు.

ప్రధానమంత్రి భావించుచున్నట్లు దేశమునందలి ప్రతీపశక్తులు కాంగ్రెసును స్వాధీనము చేసుకొని తద్వారా రాబోవు ఎన్నికలలో ప్రభుత్వమును హస్తగతము చేసుకొనుటకు ప్రయత్నములు చేయుచుండిన, అట్టి ప్రయత్నములు ఫలింపకుండచేయవలసిన బాధ్యత భారతీయ పౌరులందరిపైనను గలదు. కాని పరిస్థితులు ఇంత తీవ్రస్థితికి వచ్చినతరువాత, వాటిని సంస్కరించుటకు ఎంత ప్రయత్నించినను కాంగ్రెసునందలి రెండు వర్గముల మధ్య సఖ్యత, సామరస్యము తిరిగి ఏర్పడుట కష్టమే.

ఎన్నికఫలితమునకు ప్రధానమంత్రి ఇంత కలవరపడుటకు తగిన కారణములు కన్పించుటలేదు. టాండన్ విజయము ప్రతీపశక్తుల విజయమని విమర్శించినందువలన పరిస్థితులు మార్పుచెందవు. సర్దార్ పటేల్, పండిట్ నెహ్రూ ప్రస్తుతపరిస్థితులను సమగ్రముగ సమీక్షచేసి, దేశాంగ, విదేశాంగ వ్యవహారములందు ఇప్పటి విధానమునే ప్రభుత్వము, కాంగ్రెసు ఇక ముందు కూడ అనుసరించునని విస్పష్టము చేయుచు ఒక సంయుక్త ప్రకటన చేయుట వాంఛనీయము.

## కేంద్రప్రభుత్వ నిర్ణయం

విద్యాసంస్థలందు విద్యార్థుల ప్రవేశార్హతను నిర్ణయించుటలో కులమును ఆధారము చేసుకొని విచక్షణ చూపుట భారత రాజ్యాంగ చట్టనిబంధనలకు విరుద్ధమని చెన్నరాష్ట్ర హైకోర్టు తీర్పుచెప్పినతరువాత, ఉత్తర ప్రదేశ్, బీహారురాష్ట్ర ప్రభుత్వములు ఉద్యోగముల విషయములో కులనిష్పత్తిని రద్దుచేసెను. చెన్నరాష్ట్ర ప్రభుత్వము మాత్రము హైకోర్టుతీర్పుపై సుప్రీముకోర్టుకు అపీలుచేయ తీర్మానించుకొనెను. కులనిష్పత్తిసూత్రము రాజ్యాంగచట్ట విరుద్ధము గాదనీ, ఈ రాష్ట్ర ప్రత్యేక పరిస్థితులనుబట్టి ఉద్యోగముల నిచ్చుటలోనేగాక, విద్యాసంస్థలలో ప్రవేశార్హతలను నిర్ణయించుటలోను అట్టి సూత్రము అవసరమనీ రాష్ట్రమంత్రులు బహిరంగముగనే ప్రక

టనలు చేయుచుండిరి. ఈ రాష్ట్రములో కులనిష్పత్తి సూత్రమునకు స్వస్తి చెప్పినచో ప్రభుత్వనిర్వహణ దుస్సాధ్యమగునని అభిప్రాయపడు రాష్ట్రమంత్రులు కూడ గలరు.

కాని కేంద్రప్రభుత్వము కుల నిష్పత్తిపద్ధతిపై సమగ్రవిచారణ జరిపి, ఈ విచక్షణా విధానమును తొలగించుటకు సూచనలు చేయవలసినదిగ కేంద్రప్రభుత్వము నియమించిన 'దివాకర్ కమిటీ' లో ఈ రాష్ట్రప్రభుత్వకార్యదర్శి హోదాలోగ, ఒక్కసారిగ గాక, క్రమముగ ఈ కులనిష్పత్తిని తొలగించవలెనని సూచించియుండెను. అట్లు ప్రభుత్వకార్యదర్శి సూచించియుండుటవలన 'కులనిష్పత్తి సూత్రము' న్యాయసమ్మతము గాదని రాష్ట్రప్రభుత్వము గుర్తించినట్లు భావింపబడెను. అయితే రాష్ట్ర హైకోర్టుతీర్పుపై సుప్రీముకోర్టుకు అపీలుచేయ తీర్మానించుకొనుటవలన కులనిష్పత్తి 'సూత్రము' న్యాయసమ్మతమైనదనే రాష్ట్రప్రభుత్వము అభిప్రాయపడుచున్నట్లు స్పష్టమగుచున్నది. 'కులనిష్పత్తి' విషయములో దివాకర్ కమిటీ సిఫార్సులను చెన్నరాష్ట్రప్రభుత్వము అంగీకరించినను, అంగీకరింపకపోయినను, మొన్న కేంద్రప్రభుత్వము కులనిష్పత్తి సూత్రవిధానముగ జరుగుచున్న విచక్షణనంతను పూర్తిగ రద్దుచేయుచు చేసిన ఉత్తరువులకు భిన్నముగ ప్రవర్తింపజాలదు.

కేంద్రప్రభుత్వము దివాకర్ కమిటీ సిఫార్సులను అంగీకరించెను. ఇటీవలనె రిపబ్లిక్ అధ్యక్షుడు రాజ్యాంగచట్టనిబంధనల ప్రకారము ప్రత్యేకరక్షణకు అర్హులైన తెగల జాబితాను ప్రకటించెను. కనుక ఆ జాబితాలో తెలుపబడిన తెగలకు గాక, ఇతర తెగలకు, కులములకు ప్రత్యేక రక్షణలు, సౌకర్యములు ఉండుట రాజ్యాంగచట్టనిబంధనలకు విరుద్ధము. కనుకనే రిపబ్లిక్ అధ్యక్షుడు ఈ జాబితాను ప్రకటించిన వెంటనే, ఉద్యోగములలో షెడ్యూల్డ్ తరగతులకు, ఆంగ్లో-ఇండియన్లకు మాత్రము ప్రత్యేక సదుపాయములుంచి, మిగత విచక్షణలన్నింటినీ రద్దుచేయుచు భారతప్రభుత్వము ఉత్తరువు చేసెను.

కేంద్రప్రభుత్వఉద్యోగములందు కులనిష్పత్తి సూత్రమునకు స్థానము లేకుండచేయుటె గాక, రాష్ట్రప్రభుత్వములును ఉద్యోగముల నిచ్చుటకు రాజ్యాంగ చట్టమును అనుసరించి ప్రత్యేకనిబంధనలను తయారుచేసుకొనవలెనని ఆదేశించెను. చెన్నరాష్ట్రప్రభుత్వము ఇప్పటికినీ వెనుకటి పద్ధతినె అనుసరించునో, లేక కేంద్రప్రభుత్వ ఆదేశములను పాటించునో చూడవలసియున్నది. చెన్నరాష్ట్రప్రభుత్వ మిప్పటి పద్ధతినే అనుసరింపదలచిన, సమర్థులైనవారందరు కేంద్రప్రభుత్వోద్యోగములకు వెళ్లుట రాష్ట్రప్రభుత్వమునకు సమర్థులైనవారు లభింపకపోవుట జరుగును.

సమర్థతతో నిమిత్తము లేదనుకొనిననేతప్ప, చెన్నరాష్ట్రప్రభుత్వము కేంద్రప్రభుత్వ ఆదేశములను నిర్లక్ష్యముచేయజాలదు. రాష్ట్రప్రభుత్వము తన విధానమును మార్చుకొనదలచినట్లయితే చెన్నరాష్ట్ర హైకోర్టుతీర్పుపై సుప్రీముకోర్టుకు చేయదలచిన అపీలును ఉపసంహరించుకొనవలసియుండును.

---

# విషయానుక్రమణిక

## 20 సెప్టెంబరు 1950

# భవిష్యత్తు, మానవుడు

★

[పండిట్ జవహర్లాల్ నెహ్రూ]

చరిత్రవల్ల మానవజాతి నేర్చుకోవలసిన గుణపాఠాలు అనేకం ఉంటవని పెద్దలు చెబుతారు. అలాగే చరిత్ర పునరావృత్తం కాదనే నానుడికూడా ఒకటి వినబడుతూ ఉంటుంది. ఈ రెండు సూక్తులూ పరమ యథార్థమైన శిలాక్షరాలుగా మనం స్వీకరించవచ్చును; ఎందుచేతనంటే, చరిత్ర జగత్తువలెనే అనక్షణ పరిణామశీలమైనది యెక్కడ ఉన్నావే గొంగళీ అంటే వేసిన చోటే ఉన్నానే అన్నట్టుగా ఒకే చోట స్తబ్ధంగా పడి ఉండటం చరిత్ర లక్షణంకాదు; చక్రగమనంవలె జరిగిందే జరుగుతూ ఉండటం కూడా దాని స్వభావంకాదు చరిత్రను గుడ్డిగా అనుకరించటంవల్ల మనకు వచ్చే లాభం రవ్వంతైనా ఉండదు కాని లోతుకు దిగి చరిత్రలో అంతర్లీనంగా వున్న వివిధ శక్తుల రహస్యములను అవగాహన చేసుకోటానికి మనం ప్రయత్నించినట్లయితే అందువల్ల మనకు చాలా లాభం ఉంటుంది. కాని చరిత్రలో అంతర్నిహితమైయున్న అంతరార్థాన్ని వెలికితీయడానికి యెంత తీవ్రకృషి చేసినా, ఒక్కొక్కసారి మనకు లభించే సమాధానం అంతంత మాత్రంగానే ఉంటుంది ఈ సందర్భంలో కార్ల్ మార్క్స్ చెప్పిన ఒకమాట స్ఫురణకొస్తోంది. ఆయన ఏమన్నాడంటే "పాతప్రశ్నలకు వేటికీచరిత్రఎప్పుడూ సూటిగా సమాధానం ఇవ్వదు, పొరపాటున పాత ప్రశ్న వేశామో, మళ్లీ అనేక క్రొత్త ప్రశ్నల రూపంలో జవాబు వస్తుంది." అని

పూర్వకాలం అచంచలమైన మూఢవిశ్వాసాలకు, అశంకితమైన భయభక్తులకురోజులు ఆ కాలంలో వస్తుశాస్త్రజ్ఞులకూ ప్రజానీకానికీ తక్షకులకూ మతంమీదగాని, ఈశ్వరుని మీదగాని ఏదో ఒకదానిమీద బ్రహ్మాండమైన విశ్వాసం ఉండేది లేకపోతే అంబరచుంబియైన ఈ గోపురాలూ, బ్రహ్మాండమైన ఈ మసీదులూ ఈ దేవాలయాలూ నిర్మితం అయి ఉండేవికావు. శిలాఫలకాలను ఒక దానిమీద ఒకటి శ్రద్ధాభక్తులతో పేర్చికూర్చిన ఆ సుందరమైన ఆలయాలూ, ప్రతిరేఖలోను ప్రతివంపులోను కనిపించే ఆశిల్ప విజ్ఞానం చూస్తే, ఆనాటి ప్రజలు ఏదో గాఢమైన విశ్వాసంచేత అనుక్షణమూ ప్రేరితులై తమ కర్తవ్య కార్యాలను నిర్వర్తిస్తూ ఉండేవారు అనే నమ్మకం కలిగితీరుతుంది.

నిట్టనిలువున ఆకాశంలోకి ఎగిసిపోయే ఆ పురాతన దేవాలయాల గోపురాలూ, మసదులూ, మినారులూ చూస్తే, ఏదో అలౌకిక భక్త్యావేశంచేత శిలయే ఈవిధంగా తనంతట తానుఊర్ధ్వముఖంగా లేచి ఈశ్వరుణ్ణిగురించి తపస్సు చేస్తున్నదా అన్నట్టు ఉంటుంది. శిలారూపంలో మన పూర్వీకులు మూర్తీభవింపజేసిన ప్రార్థనలివి కాని ఆ పూర్వ విశ్వాసపు రోజులు గతించినై. ఆవిశ్వాసంతోపాటు నాటి శిలాశిల్ప విజ్ఞానంకూడా గతించిపోయింది. వేలకొలదిగా దేవాలయాలూ మసీదులూ ఈనాడూ నిర్మించబడుతున్నాయి; కాని ఆనాటి హృదయహారిఅయిన చిత్రజాలం వానిలో ఇప్పుడు గోచరంకావటంలేదు. మన అధునాతన యుగపు స్వరూపస్వభావాలకు ప్రతిబింబాలు అనదగిన మన ఆఫీసుకట్టడాలకూ ఈనాటి మనదేవాలయాలకూ క్రమంగా రూపంలో భేదంలేకుండా పోతున్నది

ఆనాటి మధ్యయుగాలకంటే మనయుగం అన్నివిధాలా భిన్నమైనది. సంశయాలూ సందేహాలూ ఆశానిరాశల డోలాందోళన మనయుగంయొక్క ముఖ్యలక్షణాలు మన ప్రాచీనులు అవలంబించిన ఆచార సంప్రదాయాలను గాని, విశ్వాసాలనుగాని అర్వాచీనులమైన మనం ధ్రువంగా స్వీకరించలేం. ఆసియాలోనైనా, యూరప్‌లోనైనా, అమెరికాలోనైనా ఎక్కడ తీసుకున్నా పరిస్థితి ఇంతే. మన నూతన పరిసరాలకు అనుగుణమైన నూతన సత్యాలను, సవ్యమార్గాలను అన్వేషించటంలో మనం నిమగ్నులమైయున్నాము. మనం ఒకరుచెప్పిన దానితో ఇంకొకరు భేదిస్తూ ప్రతివిషయాన్నీ కాకదంతాన్ని పరీక్షించినట్లు పరీక్షచేసి తర్జనభర్జనలు పడుతూ రోజుకొక కొత్తవాదాన్ని, రోజుకొక కొత్త సిద్ధాంతాన్ని స్థాపించడానికి ప్రయత్నిస్తాము.



సోక్రటీస్ కాలంలో ఏథెన్సునగరం తర్కవితర్కాలకు వాదోపవాదాలకు ఏ విధంగా పీఠం అయిందో, అదేవిధంగా ఈ నాటి యుగము తర్కవితర్కాల యుగం అయింది. అప్పుడు ఈ లక్షణం ఏథెన్సుకు మాత్రమే పరిమితమైతే, ఇప్పుడు అది అన్ని అవధులు దాటి ప్రపంచపర్యాప్తమైపోయింది. వాస్తవప్రపంచంలో అనుక్షణమూ మనకు కొట్టవస్తూ కనిపించే అన్యాయాలు పాశవికతమైన హృదయాలపై మోయరాని బరువై మన మనస్సులను నిరానందమయం చేసివేస్తున్నాయి. ఎంత కళ్లు చించుకున్నా ఈ అసుఖంలోంచి అశాంతిలోంచి బైటపడే దారి కనిపించదు. "ప్రపంచంమీద ఆశపెట్టుకొని లాభంలేదు. మనచేతిలో ఉన్నంతవరకూ మనకు సంబంధించినంతవరకూ అయినా ఋజువుగా చిత్తశుద్ధితో

ప్రవర్తిద్దాం ఇంతకుమించి మనం చేయగల్గిందిలేదు" అని మాథ్యూ ఆర్నాల్డు అన్న మాటలతో ఏకీభవించ బుద్ధి అవుతోంది.

"శబలసుందరమై స్వప్నసీమగా కనిపిస్తున్న ఈ ప్రపంచంలో నిజానికి ప్రేమగాని ఆనందంగాని వెలుగుగాని లేవు; శాంతిసుఖాలు అంతకంటె లేవు రాత్రి వేళ ఎవరు ఎవరో కూడా గుర్తెరగకుండ సంకులసమరం సాగించే శత్రుసైన్యాల యుద్ధరంగం వలె ఈ ప్రపంచం గోచరిస్తోంది" అని చెబుతూ ఆయన వ్రాసిన ఒక పద్యమీ సందర్భంలో జ్ఞాపకం వస్తోంది

కాని ఈ నిరాశాగ్రహమైన దృక్పథాన్ని గనక నిజంగానే మనం అవలంబించినట్లయితే చరిత్రనుగాని జీవితాన్నిగాని మనం సరిగా అవగాహన చేసుకోలేదనే చెప్పవలసివస్తుంది ఎందుచేతనంటే, మానవుడు క్రమంగా అభివృద్ధి చెందుతున్నాడనీ, అతని పురోగమనానికి అవధి అంటూ లేదనీ చరిత్ర మనకు బోధిస్తోంది. మానవుని జీవితం సుసంపన్నమైనది; పుష్కలమైనది. ప్రపంచంలో ఒక చెంపఅక్కడక్కడా ఊబులూ గోళ్లూ ఉన్నా, రెండో చెంప మహాసాగరము హిమాచ్ఛాదితమైన గిరిశృంగాలూ, నక్షత్రఖచితమైన విభావరులూ, తలిదండ్రులయొక్కయు స్నేహితులయొక్కయు ప్రేమవాత్సల్యాలూ ఒకే పనిలో కలిసి మెలిసే సహకర్మచారులు సౌభ్రాత్రం, గానం, పుస్తకాలూ, అనంతమైన బుద్ధి సామ్రాజ్యం మనకు ఉన్నాయి

ఇవితల్చుకుంటే ఆ వెనకటి నిరాశపోయి, మళ్లీ ఉత్సాహంతో "ఓ భగవాన్, నేను మట్టికడుపునపుట్టి మట్టిలో పెరిగిన మట్టి జీవినే అయినా. తారకితమైన మహాకాశం నా కన్న తండ్రి!" అని ఎలుగెత్తి చాట బుద్ధి అవుతుంది.

అయితే ఈ జగత్తుయొక్క సౌందర్యాన్నీ, ప్రకృతియొక్క రామణీయకతను అభివర్ణిస్తున్న ఊహాప్రపంచంలో గాలిమేడలు కట్టుకొనుమాట ఏమంత శ్లాఘనీయమైన పనికాదు.

ఇతరుల అసుఖాలుంకని పెట్టవలసిన బాధ్యతనుండి, వారి దుఃఖంవల్ల కలిగే అసుఖాన్నుండి తప్పించుకొని ఊహాప్రపంచంలో విహరించటం తేలికే. కాని ఇది ధైర్యానికీ సౌభ్రాత్రానికీ మాత్రం లక్షణం కాదు. ఆలోచనలుగాని, ఊహాలుగాని సార్థకం కావాలంటే, అవి కార్యరూపంలో పరిణతి చెందాలి. లేకపోతే అవి నిరర్థకం. రొమైన్ రోలెండు అన్నట్టు "ఆలోచనకు క్రియే పరమార్థం క్రియలేని ఆలోచనవ్యర్థం; ద్రోహం; అది ఒక విధమైన గర్భస్రావం. ఏవిధంగా మన మనస్సులు ఆలోచనకు నిర్వాహకాలో, ఆవిధంగానే మన శరీరాలు కార్యానికి నిర్వాహకాలు కావాలి"

క్రియకుదిగటం అంటే మనుష్యుడు క్షేమామూలుగా జంకుతాడు ఎందుచేతనంటే ఆకర్మయొక్క ఫలాఫలాల విషయమై అతనికి సందేహం అదీగాక కార్యాచరణకు దిగటంలో అనేక ప్రమాదాలు, చిక్కులు ఉంటాయి. ఒక ప్రమాదాన్ని తీసుకుంటే, దాన్ని దూరాన్నుంచి చూస్తే ఉన్నదానికన్న భయంకరంగా కనిపిస్తుంది కాని దగ్గరికివెళ్లి పట్టి చేశాక, అభయం సగం వదిలిపోతుంది ప్రమాదం జీవితానికి మద్యం వంటిది. మనుష్య జీవితాన్ని ఉత్తేజ పరచటానికి మధ్య మధ్య ప్రమాదాలు కూడా వస్తూఉండాలి. ఒడుదుడుకులు లేని జీవితం ఒక్కొక్కమారు మహాదుర్భరం అనిపిస్తుంది, జీవితంలో సౌఖ్యానుభూతికి అలవాటుపడిన మనిషికి నాలిక చట్టుపడిపోయి కొంతకాలానికి వాటిరుచిని గుర్తెరిగే శక్తిని కూడా కోల్పోతాడు; కొంతకాలంపాటు ఇవి లేని జీవితం గడిపి, ఆ తర్వాత వాటిని రుచి చూస్తే అవి మరింత మధురంగా మనకు చవులు గొలుపుతాయి. కొందరు సాహసులు ప్రాణాలను లెక్క చెయ్యకుండా ఉత్తుంగ గిరిశిఖరాలన అధిగమించడానికి ప్రయత్నిస్తారు ప్రమాదాల్ని అధిగమించటంలో ప్రత్యక్షంలో కలిగే

ఆనందసంచారం కోసం, ఆ ఉత్తేజనంకోసం వారు ఎంత ప్రమాదాన్నైనా ధిక్కరిస్తారు. ప్రాణాలకైనా తెగిస్తారు ప్రమాదంఆసన్నమైనప్పుడు, మనిషియొక్క సర్వేంద్రియాలు వ్యగ్రమై జాగరితమై ఉంటాయి; అటువంటి సమయాల్లో బుద్ధిశక్తి ఇంద్రియజ్ఞానం పరిస్ఫుటమై వికసిస్తయి; ఒక్క సన్నని నూలు పోగు ఆధారంగా మనుష్యుని జీవితం వ్రేలాడుతున్నప్పుడు, అతనికి ప్రతిక్షణమూ అమరమౌతుంది; జీవితంలో ఉన్న మధువునంతను వీలైనంత స్వల్పకాలంలో అతను ఆస్వాదించడానికి ప్రయత్నిస్తాడు. అతని జీవన వేగం విద్యుత్తీవ్రం అవుతుంది.

కింద ఉన్న అఖాతాలలో కొండచరియలలో అనారోగ్యకరమైన మంచుపొగలు పీలుస్తూ, కడుపులో చల్ల కదలకుండా జీవితం గడపాలా, లేక, పర్వతశృంగాన్ని అధిగమించి, ఉత్తేజకరమైన స్వచ్ఛవాయువులను పీలుస్తూ, మనోహరమైన దూరదృశ్యాలను వీక్షిస్తూ, దిగంచలాలలో వికసించే ప్రభాతానికి స్వాగతమిస్తూ, ఆనందంతో మైమరవాలా, అన్నది ప్రతివ్యక్తి తనకు తాను నిర్ణయించుకోవలసిన విషయం.

గీతాంజలిలోని గురుదేవుని ప్రార్థనతో ఈవ్యాసం ముగిస్తాను —

"మనసు భయవిముక్తమై ధైర్యంగా తల ఎత్తుకొని ఎక్కడ నిలబడుతుందో; జ్ఞానం ఎక్కడ శృంఖలాబద్ధమై ఉండదో; సంకుచిత కుటుంబపరిధులలో పరీతమై ప్రపంచం ఖండఖండాలుగా ఎక్కడ చీలిపోదో;

"ఎక్కడ వాక్కు సత్య గర్భంలోంచి ఉద్భవించునో, ఎచ్చట సంపూర్ణత్వం కోసం అవిశ్రాంతంగా అన్వేషణ జరుగుతుందో, బుద్ధిప్రభావం మృతసంప్రదాయాలలో ఇగుల్కొని ఎక్కడ క్షీణించిపోదో, మనస్సు ఎక్కడ అంతకంతకు తేజస్వినియై క్రియాసమర్థం అవుతుందో, తండ్రీ అట్టిస్వతంత్రలోకంలోకి నాదేశాన్ని నడిపించుకొని పొమ్మని ప్రార్థిస్తున్నాను."



# నాసిక్ కాంగ్రెస్



[శ్రీ రామ్ రాయ్. యం. మున్షీ]

[శ్రీ రామ్ రాయ్. యం. మున్షీ కాంగ్రెస్ స్వాతంత్ర్యసమరంలో పాల్గొని కాకలు తీరిన యోధుడు. ప్రస్తుతం గుజరాత్ లో కర్షకోద్యమ నాయకుడుగా ఉంటున్నాడు దేశాన్ని దుర్కొంటున్న దుష్టశక్తులను పరిహరించుటకు, దేశానికి సంప్రాప్తించిన దురవస్థను నిర్మూలించుటకు, ప్రజాబాహుళ్యాన్నంతా సంఘటితపరచి సమిష్టిపోరాటం సాగించవలెనని, కాంగ్రెస్ అధ్యక్షులకు వ్రాసిన తన యీ లేఖలో శ్రీ రామ్ రాయ్ సూచిస్తున్నాడు]

దేశవిభజనకు ఒప్పుకుంటూ, కాంగ్రెస్ స్వాతంత్ర్యాన్ని స్వీకరించినపుడు నేను చాలా దుఃఖించాను "తర తరాల పాటు భారతీయులను దుస్థితిపాల్జేసే విషాదగాధ ప్రారంభమైందని, కాంగ్రెస్ ప్రముఖనాయకులలో ఒకరైన సర్దార్ పటేల్‌కు హెచ్చరిక చేశాను విభజనఫలితమైన విషాదం యిప్పుడు తెలిసివస్తున్నది స్వాతంత్ర్యము, స్వేచ్ఛ, ప్రజాస్వామ్యము, దాస్య విమోచనము, జాతీయపునరుజ్జీవము, వీటికోసం పరితపిస్తూ దీర్ఘకాలం పోరాటం సలిపినవాణ్ణి నేను. బెంగాల్ విభజనోద్యమాన్ని ప్రతిఘటించి యువ ప్రజానీకం ఈ పవిత్ర ఆదర్శాల సాధనకే ప్రమాణం గైకొన్నది.

లోకమాన్య బాలగంగాధరతిలక్ వలంటీర్ దళం నిర్మింపబడిననాటి లగాయతూ నేను కాంగ్రెస్‌లో ఉన్నాను. సూరత్ కాంగ్రెస్ మహాసభలో వచ్చిన సంఘర్షణ చూశాను. గాంధీజీ ఆజ్ఞను జౌదలదాల్చి జైలు జీవితాన్ని చవి చూచాను 1930 లో న్యాయవాదవృత్తి త్యజించాను.

ధనికవర్గప్రాబల్యంక్రింద ఉన్న కాంగ్రెస్‌కు స్వాతంత్ర్యాన్ని బ్రిటిష్ప్రభుత్వం వరప్రసాదంలా యిచ్చి వెళ్లింది ఈ స్వాతంత్ర్యం లభించి మూడేండ్లయినది తగినంత అనుభవం గడించడానికి యీ మూడేండ్ల వ్యవధి మీకు లభించింది ప్రజాసామాన్యాన్ని సంఘటితపరచి, జాతీయ జీవితంలో నవయుగారంభమునకు దోహదం కాగల యీ అవకాశాన్ని కాంగ్రెస్ నాయకులు దుర్వినియోగం చేశారు ప్రజాబాహుళ్యాన్ని ఉద్ధరిస్తున్నట్లు పైకి కన్పించినా, వాస్తవానికి ప్రజాసామాన్యంకంఠం నులిపివేసే చర్యలు తీసుకోబడినవి.

ఆర్థికాభ్యుదయాన్ని గురించి కాంగ్రెస్ నాయకులు ఆలోచించనే లేదు సహస్రవత్సరాలుగా ప్రజలలవరుకొన్న సంప్రదాయాలు, ఆచారాలు యివి పాడైపోతున్నందుకు యేమాత్రమూ ఆందోళన వెలిబుచ్చనేలేదు ప్రజలలో పెరిగిన అసంతృప్తిని, చిరాకును గమనించలేదు అధికారపటాటోపము చూపే మీరు మీ అనుచరులు స్వార్థలాభపరులు, ప్రజాసేవలో పూర్తిగా విఫలులైనారు మీలో ఎవరో కొందరు సత్పురుషులుంటే ఉండవచ్చు. ఎక్కడ చూచినా, ప్రజాసామాన్యాన్ని కొల్లగొట్టేవారు, అన్యాయ లాభార్జనపరులు మీకు మిత్రులుగా తయారైనారు పరిపాలనావ్యవస్థను దుర్బలంచేశారు ప్రజాసామాన్యంపై మీ పిడికిలి బిగిస్తున్నారు. బ్రిటిష్ వ్యతిరేకోద్యమానికిగాను ప్రజాసామాన్యంపై ప్రాబల్యం సంపాదించవలసిందిగా మహాత్మ గాంధి చెప్పారు. కాని యిప్పుడు, స్వేచ్ఛను చంపివేయడానికి, దేశాన్ని కాంగ్రెస్ప్రతిష్ఠను దిగనాడ చేయడానికి ప్రజాబాహుళ్యంపై ప్రాబల్యం సంపాదించి వినియోగించుకొన యత్నిస్తున్నారు

సరే బాగానే ఉంది. అయితే ముందు కర్తవ్యం ? కాంగ్రెస్‌కు తిరిగి ప్రాణప్రతిష్ఠ చేస్తారా ? కాంగ్రెస్‌లో చేరిన మలినాన్ని నిర్దాక్షిణ్యంగా కడిగివేయగల సత్తా, ప్రాజ్ఞత మీకు ఉన్నదా ? మలినాన్ని కడిగివేయడమంటే, ప్రతికక్షులను అణచివేయడం గాదు కాని, అన్నింటికీ తలఊపే అనుమానకులను తుడిచివేస్తారా? కోల్పోయిన ప్రజావిశ్వాసాన్ని తిరిగి సంపాదించుకోగలుగుతారా? అయితే యీ దిగువపనులు చేయండి

(1) ఆరోపణలలో తగుల్కొన్న మంత్రులను తిరిగి శాసనసభలకుగాని పురపాలకసంఘాలకుగాని, స్థానికసంఘాలకుగాని, అభ్యర్థులుగా పెట్టకూడదు రాష్ట్రాలలో ఏ అధికారపదవులకూ నియోగించకూడదు



నాసిక్ కాంగ్రెసు విషయనిర్ణయసమావేశాలకుగాను ఏర్పాటు చేయబడిన షెడ్డు

(2) పరిపాలనకు సంబంధించి అన్ని రంగాలలోను, జరిగిన దుశ్చేష్టలను దర్యాప్తు చేయించాలి.

(3) పరిశ్రమలకు, ఆర్థిక వ్యవహారమున పరపతి, వీటికి సంబంధించిన విధానాలకు ప్రాముఖ్యం యివ్వాలి.

(4) కాంగ్రెస్ కమిటీలు, కాంగ్రెస్ పెద్దలు, పరిపాలనా వ్యవహారాలలో జోక్యం కల్గించుకోవడం వెంటనే మానాలి.

(5) అంతర్జాతీయ వ్యవహారాలలో అనవసర జోక్యం విరమించుకొని అన్ని రాజ్యాలతోను పరస్పర సహకారం పెంపొందించుకోవాలి. భారతదేశాన్ని స్వయం పోషకం చేయడం, ఆత్మరక్షణకు సన్నద్ధం చేయడం, యిందుకు ప్రధానాశయంగా వుండాలి.

పాకిస్తాన్‌ను సంతృప్తిపరచడం మానాలి. ఇలా పాకిస్తాన్‌ను సంతృప్తిపరుస్తూవుండడంవల్ల మనం పెట్టిబాగులవాళ్ళ మవుతున్నాము.

అమెరికా, బ్రిటన్, రష్యా, చైనాల ప్రాపకం సంపాదించుకోవాలనే తాపత్రయం తగదు. ముందు ప్రజల శ్రేయస్సు వారి బాగోగులు మన ప్రధానకర్తవ్యంగా పెట్టుకోవాలి. అధికారంలో ఉన్న పార్టీ ప్రజాభిమానం పొందాలనే సంకల్పంతో గాక, ప్రజల సుఖసౌభాగ్యాలకు కృషి చేయాలి. ప్రజలను యిలా అనునయిస్తూ, భయపెడుతూ, యిలా నాయకులు ఎంత కాలం వ్యవహారం సాగిస్తారు?

ఈ వ్యవహారం యిక చాలించండి. కాంగ్రెస్ యింకా దిగజారితే, అగ్రస్థానంలో ఉన్న మీరు స్వార్థరహితులుగా, దూరదృష్టితో వ్యవహరించకపోతే, మీ ప్రస్తుత విధానాలను మార్చుకోకపోతే, దేశంలో కమ్యూనిజం స్థావరం చిక్కించుకొని బలపడుటకు దోహదమిచ్చినవారవుతారు. మీరు నిజంగా కమ్యూనిజాన్ని వాంఛిస్తున్నారా? మీ మనస్సులను నిర్మలం చేసుకొని మీ ఉద్దేశాలను మార్చుకొని ప్రజాసామాన్యం పనిచేయండి. మీ ఆజ్ఞలను జౌదలదాల్చి నిర్మాణాత్మకమైన పని సాగించుటకు ప్రజాసామాన్యం యింకా సిద్ధంగా ఉన్నది.

లేదా! యీ పాపానికి ఫలితం ఐదేండ్లలో అనుభవించి తీరుతారు. కాంగ్రెస్ నాయకత్వాన్ని నమ్మి మోసపోయినందుకు ప్రజాసామాన్యం మిమ్మల్ని నిందిస్తుంది. జాతీయపునర్నిర్మాణానికి ధర్మయుద్ధం ప్రారంభించండి.

ప్రజాశక్తిని సమీకరించి ఆర్థికాభ్యుదయాన్ని సాధించుటకు అభిమానులను, విమర్శకులను, ప్రతికక్షులను యీవన్నిండినీ కూడగట్టుకొని నిర్మాణాత్మకంగా పనిచేయండి. లేదా నామరూపాలు లేకుండా నశించిపొండి.

కాబట్టి యీ రెండింటిలో యేదో ఒకటి ఎంచుకోండి. కాంగ్రెస్ గెలిచినా ఓడినా అది మీ చేతుల్లోనే ఉన్నది. మీరు ఓడినా, ప్రజాసామాన్యం సజీవంగా వుంటుంది. అధికారాన్ని త్వరలో చేజిక్కించుకొంటుంది. "స్వతంత్ర భారత్ అమర్ రహే"

---



నాసిక్ కాంగ్రెసు మహాసభకై విచ్చేసిన కాంగ్రెసు కార్యదర్శులు కళా వెంకట్రావు, శంకరరావు దేవు గార్లను 14 వ తేదీన నాసిక్ స్టేషన్ వద్ద ఆహ్వానసంఘం వారు స్వాగతమిచ్చారు.

మైనది. అందుచేత నే కవి తనతీర యాత్రలో ప్రతీదాన్నీ పలకరించకుండా ఉండలేడు. కనక మనం సాహిత్యసభకోసం అన్ని రాజకీయపక్షాలదగ్గరికీ వెడతాము. అందరి సహాయము తీసుకుంటాము. మన సభలకు వారు, వీరు అనకుండా అందరినీ పిలుస్తాము. ఈ సాహిత్యసభ దేశాన్నంతటినీ ఉద్రూతలూగించి వెయ్యాలని అనుకున్నప్పుడు, మనం అందరినీ కూడగట్టుకోవాలి కాని అల్లాగని ఏ ఒక్క రాజకీయపక్షంతోను మనం మమైక్యం కాకూడదు. నే నొకరి పేరు చెబుదామని అనుకుంటున్నాను. దానికి అధ్యక్షులుకూడా అంగీకరిస్తారని అనుకుంటాను—

అందరు కవివైపు ఆత్రంగా చూచారు.

ఆయన మరి ఎవరుకాదు. మన సుందరమయ్యర్ గారు. వీరు ఆంధ్రంలో గొప్ప విద్వాంసులు. మంచి సాహిత్యవేత్తలు"—

ఈ సుందరమయ్యర్ మాజీ హైకోర్టు జడ్జి. అందుచేత అధ్యక్షునికి ఈపేరు బాగా వచ్చింది. పేరు విన్నతరవాత ఆహ్వానసభ్యు లెవరు కాదనలేదు. ఒకాయన మాత్రం నీళ్ళు నములుతూ 'వీరు ఆంధ్రులేనా అని నా అనుమానం' అన్నాడు.

"ఇదేమిటి అల్లాగ అంటారు. అసలు వారిపేరు సుందరమయ్య. వీరు తెలుగువారు. మదరాసులో ఉండడంచేత అందరు వీరిని అయ్యర్ అని అంటున్నారు. వీరు పదిపదిహేను ఏళ్ళపాటు మనవైపున జిల్లా జడ్జీగా పనిచేశారు. చివరి రోజుల్లో హైకోర్టుజడ్జీగా పనిచేసి మదరాసులోనే స్థిరపడ్డారు. వీరిని ఎన్నుకొంటే అన్నివిధాలా చాలా బాగుంటుందని నా నమ్మకం. ఆపైన మరి మీ చిత్తం."

కవి ఈ మాటలు చెప్పి హృదయ దఘ్నంగా ఒక దమ్ము లాగాడు. కవి చేసిన రాజీ అధ్యక్షునితో సహా అందరికీ నచ్చింది.

ఆహ్వానసంఘసభ్యులందరు చాలా చురుకుగా సభాసన్నాహాలు చేశారు. ఆంధ్రదేశంలోని ప్రఖ్యాత సాహిత్యవేత్తలకు, ప్రముఖ చిత్రకారులకు రాకపోకల ఖర్చులు, ఆహ్వానాలు ఒక్కసారిగా వెళ్ళాయి. తెలుగుదేశం నాలుగు మూలలనుంచి ప్రముఖులంతా వచ్చారు. చిత్రకళా ప్రదర్శనముతోబాటు నాటకాలు, బుర్రకథలు మొదలైనవికూడా ఏర్పాటు చేశారు. అన్ని ప్రదర్శనాలలోకి చిత్రకళాప్రదర్శనం బాగా రక్తి కట్టింది. అందులోను ఒక చిత్తరువు మరీ బాగా జనాన్ని ఆకర్షించింది. అది గాంధీ చిత్తరువు. ఇంచుమించుగా మనిషిఎత్తున ఉంది నవకాళీలో హిందూ మహమ్మదీయ సామరస్యంకోసం గాంధీ పాదచారిగా సంచరించే ఘట్టాన్ని వర్ణించే చిత్తరువది. గాంధీ తన యాత్రలో ఒక పల్లెలో ఆగి చెయ్యెత్తి జనానికి శాంతిప్రబోధం చేస్తున్నాడు. దూరంలో ఆకాశం అరుణారుణంగా మెరుస్తున్నది భయావహంగా ఉన్న ఆ వాతావరణంలో మినుకుమినుకు మని ముత్యంలా ఒక చుక్క మెరుస్తూంది. గాంధీ చిరునవ్వుతో ముగ్ధమై పోయిన జనసమూహం, తన్మయత్వంతో ఆయన సందేశం వింటూంది. ఆసమయంలో ఆ జనం మనస్సులలో ఉండే ద్వేషాలు, అసూయలు, అనుమానాలు అంతరించి పోతున్నట్లున్నాయి.

చిత్తరువులో జనం గాంధీసందేశానికి ముగ్ధులై పోయినట్లే, సమావేశానికి వచ్చిన జనంలో చాలామంది ఆ చిత్రం చూచి ముగ్ధులై చిత్తరువు లైనారు. వర్ధిష్ణు చిత్రకారుడు చిత్రించిన ఆ చిత్రానికి ఉత్తమ బహుమతి వచ్చింది. ఈ కారణాలచేత జనం అంతా చూడడానికి వీలుగా ఆ పటం తీసుకువచ్చి సాహిత్యసమావేశాలు జరిగే హాలులో ఉపన్యాసవేదిక వెనకాల వేళ్ళాడగట్టారు.

సభా సమావేశంకోసం ఏర్పాటు చేసిన రెండు రోజులలోను మొదటినాటి కార్యక్రమం అంతా 'జయప్రదం'గా జరిగిపోయింది. ఇక రెండవరోజు రాత్రి ఆడే నాటకంతో సాహిత్యసమావేశం అంతా పూర్తి అయిపోతుంది. కాని రెండవరోజు మధ్యాహ్నం ఒక చిన్న సంఘటనజరిగింది. అది తెరవెనుకాల పరస్పరంగా జరిగిపోవడంచేత అంతగా జనాన్ని ఆకర్షించలేదు.

రెండవరోజుమధ్యాహ్నం 3 గంటలకు ఒక ప్రముఖ శతావధాని సాహిత్యప్రయోజనాన్ని గురించి ఉపన్యసిస్తారని ప్రత్యేకంగా కరపత్రాలు పంచిపెట్టారు. ఆయన మంచి వక్త; పేరుపొందిన రచయిత. 3 గంటలకు ఉపన్యాసప్రారంభం అయినా రెండు గంటలకే జనం అంతా హాలు నిండిపోయారు. ఇంకా క్రొత్తగా వచ్చిన వారు చోటు చాలక హాలుగుమ్మాలలో నిలబడుతున్నారు. కవి శతావధానిని తీసుకుని ఉపన్యాసవేదికదగ్గిరికి వచ్చాడు. ఇక అరగంటలో సభ ప్రారంభం కావలసి ఉంది. ఎదురుగా తెరవేసి ఉంది. హాలులో జనం కోలాహలం అంతకంతకు మించిపోతూంది. ఇక నాకరు వచ్చి కుర్చీలూ అవీ సర్ది తెర ఎత్తి నయ్యగానే కవి శతావధానిని గురించి రెండు పరిచయవాక్యాలు చెబుతాడు. వెంటనే శతావధాని ఉపన్యాసం ప్రారంభం అవుతుంది.

శతావధానికి వక్తృత్వశక్తితోబాటు కొంచెం తిక్క కూడా ఉంది ఏదైనా లేదా వస్తే ఆయన ఉపన్యాసం అంతా రసాభాసం చెయ్యగల సమర్థుడు అందుచేత కవి ఆయనకు వెంటవెంటనే ఉండి వ్యవహారం అంతా నడిపించుకు వస్తున్నాడు.

శతావధాని ఒక్కసారి ఉపన్యాసవేదిక నాలుగువైపులా పరిశీలిస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. వెంటనే అతని కళ్ళకి గాంధీ చిత్తరువు కనబడింది కుర్చీమీద కూర్చున్న శతావధాని జేవురించిన ముఖంతో లేచి నుంచున్నాడు. ఇకముందు క్షణంలో అక్కడినుంచి వెళ్ళిపోయేటట్లు కనబడ్డాడు. కవి అతని ధోరణి చూసి గాభరాపడ్డాడు.

అయినా ప్రశాంతంగా ఇల్లాగ అడిగాడు.

"ఏమిటి? ఎక్కడికి వెడుతున్నారు?"

"నే నసలు ఉపన్యాసం ఇవ్వను!"

"ఏమిటి కారణం?"

ఇది రాజకీయ సభా? సాహిత్యసభా?

"ఏం? అల్లా అడుగుతున్నారు?"

కాదు! అడుగుతున్నాను! చెప్పండి!

దీనితో కవి క్షణకాలం ఆలోచించాడు. శతావధాని రాష్ట్రీయ స్వయంసేవకసంఘం అంటే చాలా అభిమానం ఉన్నవాడు. అందుచేతనే ఆయన ఇంత నిక్కచ్చిగా అడుగుతున్నాడనీ, సభ రసాభాసం కాకుండా ఉండాలంటే ఏదో పని నడిచిపోయే మార్గం చూడాలనీ కవి నిశ్చయించుకున్నాడు

"అసలు మీ కిది సాహిత్యసభ కాదని అనుమానం ఎందుకు కలిగింది

"అలాంటప్పుడు మీ రిక్కడ గాంధీ బొమ్మ ఎందుకు తగిలించారు?" "దానికేం ఏవో నలుగురు అది బాగా ఉందని అన్నారు వచ్చిన జనం అందరికి చూడడానికి వీలవుతుందని—"

"సరే! కానివ్వండి! నేను వెళు తున్నాను"

"ఉండండి! నా మనవి కొంచెం వినండి! పోనీ ఈ బొమ్మ ఇక్కడ ఉంటే తప్పేం?"

"ఇంకా తప్పేమని మెల్లిగా అడుగుతున్నారా?"

"అవును! ఆయన కీ, రాజకీయాల కీ సంబంధం ఏమి ఉంది? ఆయన కేవలము అహింసావాది - కేవలం అహింసద్వారానే—

"చాల్లెండి! వీడి అహింస పీడాను! వీడి మూలాన్నే దేశం రెండు ముక్కలై పోయింది ఇప్పటికైనా చచ్చాడు కాబట్టే మనం అంతా బతికి పోయాం! లేకపోతే దేశంఅంతా ఇంకా అధోగతి పాలైపోయేదే!"

కవి శ్రుతి మించిపోతున్నదని గ్రహించాడు అప్పటికే సభ ప్రారంభించే సమయం అయింది తెరకు అవతల హాల్లో కల్లోలం ఎక్కువవుతున్నది? ఇంక ఆలస్యం చేస్తే జనం ఊరుకునేటట్లు కనబడలేదు ఇప్పుడు ఏదో విధంగా ఈయన చేత ఉపన్యాసం ఇప్పించకపోతే సభ అంతా రసాభాసం అవుతుంది.

"సరే! దాని కేంగాని, నా మనవి వినండి! మీ ఉపన్యాసం వినాలని జనం అంతా తహతహ పడుతున్నారు. అప్పటికే టైము అయింది సభ ప్రారంభించేద్దాం"

"మీరు వెయ్యి చెప్పండి! లక్ష చెప్పండి నేను ఈ గాంధీబొమ్మ ఇక్కడ ఉంటే ఇక్కడ నుంచుని ఉపన్యాసం ఇవ్వదలుచుకోలేదు. ఇవ్వను!"

ఇంతలో సభలో అలజడి ఇంకా ఎక్కువైంది. ఇది చూసి సంగ తేమిటో కనుక్కుందామని ఆహ్వాన సంఘాధ్యక్షుడు అక్కడికి వచ్చి కవీ, శతావధానీ వాదించుకోవడం దూరాన్నుంచి కనిపెట్టాడు. కొంచెం సేపుండి ఇక లాభంలేదని కవిని ఒకసారి దగ్గిరికి రమ్మని సంజ్ఞచేశాడు. "దయచేసి ఒక్క నిమిషం కుర్చీమీద విశ్రమించండి" అని శతావధానితో చెప్పి కవి ఆహ్వాన సంఘాధ్యక్షునితో మాట్లాడడానికి వెళ్ళాడు. ఆహ్వానసంఘాధ్యక్షుడు సభ ఇంకా ప్రారంభం కాలే దేమని చిరాకుతో విసుక్కున్నాడు.

ఏమిటండీ ఆలస్యం?

"ఏమీ లేదు. ఆయన ఉపన్యాసం ఇవ్వనని భీష్మించుకుని కూర్చున్నాడు"

"ఎందు కీ అలక?"

ఆయన ఆర్. యస్. యస్. మనిషి - ఆ గాంధీబొమ్మ అక్కడఉంటే ఉపన్యాసం ఇవ్వనని శఠించు కూర్చున్నాడు

"అదేం పుట్టి మునక! కొంచెం మెల్లిగా చెప్పి దారిలో పెట్టకపోయారు?"

"ఏమి చెప్పినా లాభం లేదు. చాలా పట్టుదల మనిషి"

"అయితే పొమ్మనండి! మరి ఎవరి చేతనైనా ఏపాటలో, పద్యాలో పాడించండి!"

"అలా అనకండి! ఆయన చాలా గట్టి అభినివేశా లున్నవాడు పని జరిగించవలసినవాళ్ళం మనం కూడా తొందరపడితే ఎలాగ?"

"అయితే ఏం జెయ్యమంటారు?"

"ఆ బొమ్మ అక్కడినించి తీసేద్దాం... మన పని జరిగిపోతుంది.

"వల్లకాదు నే నెంతమాత్రం ఒప్పుకోను! ఎవడో పుల్లయ్యకోసం మహాత్మాజీ బొమ్మ తీసెయ్యడం ఏమిటి?"

"నా దొక్క మనవి. అది చిత్తగించండి! "తొందరపడకండి!"

"ఏమి టది?"

"ఒకళ్ళు తిక్కగా ఉన్నప్పుడు మనం కొంచెం తమాయించాలి. ఈయన్ని మనం బోలెడు రాకపోకల ఖర్చులిచ్చి రప్పించాం. అదీగాక ఈయన ఊళ్ళోకి వచ్చారనీ, మధ్యాహ్నం వీరి ఉపన్యాసం ఉంటుందనీ తెలియబరిచాం. మరి ఇప్పుడు ప్రోగ్రాము మారిస్తే బాగుండదు. దీనికి నే నొక దారి ఆలోచించాను. ముందు నామాట విని తరవాత దాని మంచి చెడ్డలు ఆలోచించండి!"

అధ్యక్షుడు ఒక్క నిమిషం ఊరుకుని చిరునవ్వుతో 'ఏమి టా గోదారి?' అన్నాడు.

"అసలా చిత్తరువు చిత్రకళా ప్రదర్శనానికి వచ్చింది. అది బాగుంటుందని అందరు అన్నప్పుడు నలుగురి మధ్యా పెడితే జనం రంజకంగా ఉంటుందని ఈ హాల్లో పెట్టించాము. ఇప్పుడు దాన్ని తిరిగి ప్రదర్శనంలోకి పంపించి వేద్దాం. దాంతో ఈ గొడవ వదిలిపోతుంది. నాకరుచేత దీన్ని పరస్పరంగా పంపించివేస్తాను."

అధ్యక్షుడు మాట్లాడలేదు. అలా నిర్ఘాంతపడి చూస్తూ నించున్నాడు.

"ఇక మీరు తటపటాయిస్తే లాభంలేదు. హాల్లో గోల ఎక్కువగా ఉంది."

"ఏదో తట్టు తగలెయ్యండి" అని రుసరుసలాడుతూ అధ్యక్షుడు అక్కడనించి వెళ్ళిపోయాడు.

సభ శాంతంగా జరిగిపోయింది. శతావధాని సాహిత్యప్రయోజనాన్ని గురించి గంభీరంగా ఉపన్యసించారనీ, సభలు చాలా జయప్రదంగా జరిగాయనీ, ఇలాంటి సభలు ఆంధ్రదేశాభ్యుదయానికీ, సాహిత్యాభివృద్ధికీ చాలా అవసరమనీ పత్రికలు ముక్తకంఠంతో ప్రశంసించాయి!

---



ఏకశిలానగరమున మహాశివరాత్రినాడు ఎన్నియో చోట్ల అలజడులు రేగినవి

పలువురు తండములు తండములుగా నగరములోని వ్యవహారశాలలపై దాడులు సలిపిరి అక్కడక్కడ కాపున్న యల్పసంఖ్యాకులగు భటులు ఆ దాడుల నతికష్టముపై నరికట్టిరి

ఒక తండము అన్నమంత్రి భవనమును ముట్టడించెను కాని యక్కడ గురునాథుడును మారనయు పరివారము నంతటిని సిద్ధము చేసికొని యెదుర్కొనుటచే వచ్చినవారు విచ్చిపోయిరి

రాజమందిరముచుట్టును కొందరు తారాడుచున్నట్లుపలక్షించి యచ్చటి భటులు జాగరూకులై వారిని పారద్రోలిరి

ఒక తండము వేశ్యావాటికవైపు పోయి, యందులో మాచల్దేవి భవనములోనికి జొరబారి విలువగల వస్తువులను భగ్నముచేయుచు ద్రవ్యము దోచుకొనసాగిరి సకాలమున నచ్చటికి గోవిందశర్మ తన నూర్గురు బ్రాహ్మణవీరులతో వచ్చి యా మూకలను పారద్రోలెను

గోవిందశర్మ అన్నమంత్రి యాజ్ఞకొప్పున తన భటులతో ద్యూతశాలకు పోయెను గాని యా ద్యూతశాలలో నెవ్వరు లేరు ఆ పిమ్మట వారు మాచల్దేవిభవనమువైపు వెళ్ళియుందురని యూహించి యటు వెళ్ళెను గాని వారెవ్వరు నక్కడ లేరు ఐనను మాచల్దేవి యిల్లు దోచుకొనుచున్న పూర్వోక్తమగు మూకను మాత్రము పారద్రోలగలిగెను

ఆతడంతట జూదరులకై పట్టణమున నలజడి జరుగుచున్న చోటుల నెల్ల వెదకెను కాని కనపడలేదు

తుదకు క్రీడాశైలము నొద్ద పెద్దమూక చేరినదని విని యాతడచ్చటికి బోయెను అప్పటికే ఆ మూక యక్కడి భటులను నిర్జించి క్రీడాశైల మెక్కుచుండెను ఆ యెక్కువారును క్రీడాశైలశిఖరమునకు పెద్ద మోపులతో గడ్డి చొప్ప చెత్త చెదారము చేర్చుచుండిరి అది చూడ గోవిందశర్మకు ముందు చిత్ర మనిపించెను వీరి యుద్దేశమేమి?

అంతలో లోకానుభవముగల యా యువకునికి మెరపు మెరసినట్లును కవితావేశమువలెను స్ఫురించినది

"దూరమున నున్నవారి కెవరికో వీరు సంజ్ఞతో వార్త నంపబూనుకొన్నారు!"

వెంటనే గోవిందశర్మ తనతోనున్న వీరులతో క్రీడాపర్వతముపై కధిరోహించి యక్కడ నున్నవారితో తలపడెను

వారిలో ద్యూతశాలలో తాను చూచినవారున్నారు ఆ లోపలి నుండి వచ్చిన జైనసాధువేషధారియు నున్నాడు!

ఉభయులకును పోరు సాగుచున్నది పై శిఖరభాగమున చేర్చిన చెత్తకు ఆ వేషధారి స్వయముగా నిప్పు అంటించినాడు శర్మ ఎన్నడును విని యుండని వాక్కులు ఏదో భాషలో నుచ్చరించుచు, నా వేషధారి యా చెత్తచుట్టును తిరుగుచు చుట్టును నిప్పు అంటించుచున్నాడు ఆ చెత్తయు రగుల్కొని మండసాగినది

ఆ శిఖరమునకు పోయినవారు వచ్చిన మార్గమున గాని వెనుదిరిగి రాలేరు అవల కొండరాయి నున్నగా నిట్టనిలువున నున్నది మనుష్యమాత్రుడటుపోయి ప్రాణములతో నుండలేడు సరాసరి పోయి ఎంతో దిగువ నున్న స్వయంభూసరోవరములో పడిపోవుదురు అందుచే పై నున్నవారు గోవిందశర్మతో వచ్చిన వీరులతో పోరాడక తప్పలేదు కాని వారందరు నిష్కరుణముగా ఖండింపబడిరి వేషధారి మాత్రము శిఖరాగ్రమునుండి రెండు మూడు తాళ్ళ ప్రమాణమున క్రింద నున్న స్వయంభూసరోవరములోనికి తలక్రిందుగా దూకి యదృశ్యుడయ్యెను

కేశవశర్మ ఎంత ప్రయత్నించినను ఆ మండెడు మంటలార్పింపలేకపోయెను ఆ పైన చిన్న కొంపడియలోనున్న యుదకము తప్ప వేరు నీరు లేదు ఆ ఉదకమంతయు పోయించినను మంటలు చల్లారలేదు తెల్లవారువరకు ఆ యేకశిలాశిఖరాగ్రమట్లే మండుచుండెను దూరమున రెండు మూడు యోజనములవరకు నది కనబడుచు నేకశిలానగరమే మండి దగ్ధమై పోవుచున్నదను భావము కలిగింపసాగెను

* * *

ఆ దినుండి స్వయంభూదేవాలయమువైపునకు వచ్చుచుండిన అన్నమంత్రి యది గమనించెను కాని ఏమి చేయగలడు?

అన్నమంత్రి ఇప్పుడెక్కడికి పోవలెను? ఒక్క క్షణకాలమాతడాలోచించెను అతనికి స్వగృహమునకు పోవ నిచ్ఛ కలుగలేదు, సరాసరి తా నిన్నాళ్ళు నున్న చెరసాలకే తిరిగిపోయెను

తెల్లవారబోవుచున్నది అన్నమంత్రి స్నానసంధ్యాదికములాచరించెను క్రిందటి దినమంతయు నాతడుపవసించి యుండెను రాత్రియంతయు జాగరణము చేసి బడలియుండెను ఏమైన భుజింపవలెనను నిచ్ఛ జనించినది కాని నేడమావాస్య అమావాస్యాంగములగు పితృకర్మ లాచరింపనిది తానేమియు భుజింపరాదు

జాము ప్రొద్దెక్కు వేళ పూర్వనిర్ణీత విధమున స్వయంభూ దేవాలయము ప్రాంగణమున నాయకుల నందర కలసికొనెను కొద్ది మాటలతో రాత్రి జరిగిన విషయములు వారల కాతడు వివరించెను క్రొత్తగా వచ్చిన వార్తలు ఆలకించెను ఏకశిలపై ఆ వేసిన మంట ఎవరికో సంకేతము! ఎవరికి? ఎవరికైనను కోట సర్వవిధముల రక్షించుటకు పూనుకొనవలెను విశ్వాసపాత్రులగువారిని నిర్ధారణచేసి వారికి పను లప్పగింపవలెను

అన్నిటికంటె ముందు శ్రీరుద్రదేవమహారాజుల క్షేమ వార్తలు తెలిసికొనవలెను! వెంటనే తిక్కచమూపతిని గోనగన్నారెడ్డిని తమ మహాసైన్యములతో అతిశీఘ్రప్రయాణముల వెనుదిరిగి ఏకశిలానగరము చేరుకొనునట్లు చేయవలెను అంబదేవునిగూడ సాధ్యమైనంత సేనతో ఏకశిలానగరమునకు రమ్మని వార్తలు పంపవలెను! ఆ సభలో ఏకవాక్యతయేగాని రెండవమాట లేదు

ఆ సభయైనవెంటనే అన్నమంత్రి తన బంధనశాలకు పోయి అమావాస్యాంగకర్మకలాపములు కావించుకొని భుజించెను భోజనమగునప్పటికి, తిక్కనసోమయాజుల యాజ్ఞచే నాతని యాశ్వికభటు డకు బవిరినీడు, అన్నమంత్రీశ్వరుల కాంభోజాశ్వమును దెచ్చెను దాని నెక్కి యన్నమంత్రి ఏకశిలానగరమం దెల్లెడ సంచరించెను అత డట్లు వాహ్యాళికై సంచరింపలేదు!

అతడు వెళ్లుచున్న ప్రదేశమంతయు నాతని మనస్సులో నచ్చొత్తినట్లు చిత్రిత మొనర్చుకొనుచుండెను శిలాప్రాకారమే స్థితిలో నున్నది? పుట్టకోట ఎట్లున్నది? ఎట్టివా రెక్కడ నున్నారు? దానితోపాటు ఆతని తలలో లెక్కలును సాగిపోవుచుండెను ఈ కోటరక్షణకు ఎందరు భటులు కావలెను? ఎట్టి భటులు కావలెను? ఆతడు మరల నిజబంధనశాలకు వచ్చునప్పుడు ఉత్సాహముగా లేడు!

సుందాతడు విపరీతముగా నాహారపదార్థములు రాజమందిరమునకు చేర్పించి, అందలి జలాశయము లన్నియు నింపునట్లు చేసెను పుట్టకోటను కాపాడగల సేనలు ప్రస్తుతము లేవు శిలాప్రాకారము పూర్తి కాలేదు రాజప్రాసాదముచుట్టును పూర్తిగా కట్టబడియున్న యున్నత మగు ప్రాకారమే ప్రధాన మగు శరణ్యప్రదేశముగా నాతనికి పొడకట్టెను అక్కడనే మహాసేనలు వచ్చువరకు శత్రుసేనలు నిలువరించుట సాధ్యపడవచ్చును! ఇంతలో కొంత సేనను ప్రోవుచేయవలెను!

అదృష్టవశమున మూడవనాటికి శ్రీ రుద్రదేవమహారాజులు సురక్షితముగా పాకాలస్కంధావారము చేరి రను వార్త వచ్చినది!

* * * *

శ్రీవీరభద్రేశ్వరులను గాయపరచి శ్రీరుద్రదేవమహారాజులు గుర్తించిన సమయమున, నక్కడికి వచ్చిన యాశ్వికులు పాకాల నుండి సాయమువచ్చుచున్న సైనికులు వారు శ్రీరుద్రదేవమహారాజుల యాజ్ఞచే వీరభద్రేశ్వరుని భద్రముగా చికిత్సకై వైద్యుల యొద్దకు పాకాల చేర్చిరి

ఆ యాశ్వికులు శ్రీరుద్రదేవమహారాజుల నా స్థితిలో చూచుటచే ఉద్వేగమును ఆనందమును పొంది పాకాలకు దయచేయ వేడిరి కాని మహారాజు లందు కంగీకరింపక ఆ యాశ్విక సేనను తీసుకొని, తాను వచ్చినదారిన వెనుకకు ప్రయాణమయ్యెను ముందు వారికి మనుమసిద్ధియు పర్వతనాయకుడును కనబడిరి ఆ తొమ్మిదిమందిలో జీవించియున్నవారు వారిద్దరే వారును మిక్కిలి గాయపడి బాధపడుచుండిరి వెంటనే రుద్రమ వారి కుపచారములు చేయించి వైద్యులయొద్దకు చికిత్సకు చేర్పించెను

మరికొంతదూరము పోగా ముందు తన్ను వెన్నాడివచ్చిన యాశ్వికుల నెదిరించిన పదిమంది యాశ్వికుల శవములును కనిపించినవి శ్రీరుద్రదేవమహారాజులు కన్నీటితో వారికి తర్పణ మొనర్చి, వారి శవములకు విధివిధానమున సంస్కారము లొనర్ప నాజ్ఞ లిచ్చెను

అంత మరియు వెనుకకు బోయి ఆశ్వికులను ధైర్యసాహసములతో తన పదాతు లెదిరించిన ప్రదేశము చేరికొనెను వారిలో పలువురు వీరశయ్యలలంకరించిరి కాని నూరుమందిమాత్రము గాయపడియు ప్రాణములతో నున్నారు వారి కందరకు నుపచారములకును వైద్యమునకు ఏర్పాట్లు చేసి, మరల నా యాశ్వికులతో తన్ను వెంటాడిన యాశ్వికదళమును కనిపెట్టి వెంటాడి పోరుట కుద్యమించెను కాని వారు కనబడలేదు వారి జాడయే లేదు!

ఎంత ప్రయత్నించినను ఆ శత్రుసేన హరించిన తన యైదు కరులును పంచశబ్దములును రుద్రదేవమహారాజులకు తిరిగి లభింపలేదు!

తుదకు నిరాశచేసుకొని యా రాత్రికి మహారాజు పాకాల చేరికొని విశ్రమించి ఏకశిలానగరమునకు వార్త లంపెను

అక్కడినుండి శ్రీ రుద్రదేవమహారాజు లామరునాటి యుదయముననే బయలుదేరి రాత్రికి ఏకశిలానగరము చేరికొనిరి

మహారాజులు విజయయాత్ర చేసి తిరిగి వచ్చి యుండుటచే మహోత్సవము చేయవలసి యుండెను కాని యట్టి దేదియు జరుగలేదు శ్రీరుద్రదేవమహారాజులను మరల చూడగలిగినందుకు నాయకు లందరును ఆనందపరవశులై యుండిరి కాని వారిపై నిప్పుడు విశేషభారము పడినది! ఏకశిలానగరమును గణపతిదేవులను ప్రతాపరుద్రకుమారులనే కాక శ్రీరుద్రదేవమహాజులను గూడ రానున్న యాపదనుండి రక్షించుకొనవలసిన భారము వారిపై నిప్పుడున్నది దేవగిరియాదవసేనలు సమీపించిన వార్త యిప్పుడు రహస్యము కాదు అది యందరికిని తెలిసిపోయినది!

అంతఃపురములోనికి వెళ్లి శ్రీరుద్రదేవమహారాజులు ముందు గణపతిదేవుల దర్శించి మ్రొక్కి నిజమందిరము చేరిరి కామసాని వచ్చి దృష్టి తీసినది కుబ్జ ప్రతాపరుద్రకుమారులను తీసుకొని వచ్చినది ముమ్మడంబ వచ్చి నమస్కరించినది మహాదేవరాజు వందన మాచరించెను

రుయ్యమ్మమాత్రము రాలేదు! తాను ప్రతినిధిగా నుంచిపోయిన రుయ్యన్మ రుద్రమకు కనిపించనేలేదు! చిత్రము! అస్వస్థతగా ఉన్నదా? ఎవరును ఏమియు చెప్పలేదు అడుగుటకు రుద్రమ సాహసింపలేదు!

ఈమధ్యలో జరిగిన సంగతు లన్నియు మననచేసికొనుచు, నా రాత్రి రుద్రమకు ప్రొద్దుపోవువరకు నిద్దురపట్టలేదు నిద్రించి యారుగడియ లైన గాలేదు!

అంతలో దూరమున భయంకరముగా తప్పెట్ల మ్రోత విన వచ్చినది అది పూర్వము రుయ్యమ్మ వినిన ఉత్సవాంగమగు తప్పెట్ల ఝుక ఝుంఝుం మ్రోత కాదు! ఇవి రణతప్పెట్లు! రణభేరులు!

తెల్లవారి చూచునప్పటికి దేవగిరి యాదవసేనలలో నగ్రదళములు ఏకశిలానగరప్రాకారమును దరిసి పురావరోధనమునకు ననుకూలములు స్థానములు నిర్ణయించుకొనుచుండెను! వెనుకనుండి సేనాప్రవాహమే వచ్చుచున్నది!

# అసమర్థుడి ఆర్థిక జీవనం

మాతృక:
**స్టీవెన్ లీకాక్**

తెనిగింపు:
**శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ**

గుమాస్తాలు గాబరా పెడతారు కౌంటరు పూచలు లోపల్నుంచి కంగారు పుట్టిస్తాయి ఆ లక్ష్మీకటాక్షమే, రూపాయల కట్టలు, నోట్లు, చిల్లరకుప్పలూ, అవే ఆంతర్యంలోనుండి ఆందోళనము పురిగొల్పుతవి

ఆ సమయంలో కంట పడ్డ ప్రతీదీ కంగారు పుట్టిస్తుంది నిప్పు త్రొక్కిన కోతిలా అయిపోతాను నేను బ్యాంకు ఆవరణలో అడుగుపెట్టె పెట్టడంతోవట్టి అబాంద్రాలా గంద్రగోళపడిపోతాను కలవరపాటు ఆవేశిస్తుంది నన్ను

ఏదోవ్యాపారరీత్యా కౌంటరువద్దకు చేరిన మరుక్షణంనుంచి, (కలవరపాటనండి, కంగారువల్లనండి) నేను పద్ధ తెలివితక్కువ వాజెమ్మలా ప్రవర్తించటం కద్దు!

ఈ సంగతి నాకు తెలుసు తెలిసినా ముందుజాగ్రత్తపడ్డాని కవకాశమున్నా గత్యంతరం లేకుండాపోయింది ఎందువల్లనంటే యిప్పుడు నా జీతాన్ని యాభై రూపాయలు పెంచారు యీ పెంచటంవల్ల కాస్తో కూస్తో ఆదా చేయవలసిన అవసరం ఏర్పడి, అందుకోసం బ్యాంకుకు వెళ్ళవలసిరావటం తప్పనిసరి తద్దినమై కూర్చుంది సరే వెళ్ళాను కాళ్ళీడ్చుకుంటూ ఇక 'మీపాల బడ్డాను పాలుముంచినా నీటముంచినా-' అనుకుంటూ భీరువునై కలయచూశాను గుమస్తాల్నందర్నీ.

ఏ పరమదౌర్భాగ్యుడన్నా బ్యాంకులో ఖాతాదారుడు కావాలంటే, వాడు ముందు మేనేజరు నడిగి ఆయన సలహా పుచ్చుకుని ఆ పైన ఏడవాలని అది చాలా అవసరమని నాకు లీలగా గుర్తు

'అక్కౌంటెంట్' అని బోర్డురాసివున్న కంతదగ్గరకు నేరుగా వెళ్ళాను పిశాచిబ్రహ్మరాక్షసుడిలా పొడుగ్గా పూచలా వున్నాడు ఆ 'అక్కౌంటెంట్' వాడ్ని చూట్టంతోనే నాకు లోపల్నుంచి కుండల్లో గుత్తాలు త్రోలినట్లు గాబరా ఎత్తుకొచ్చింది వున్నట్లుండి నా గొంతుక కూడా పూడిపోయింది

అశ్వత్థామహతః కుంజర అన్నట్లు పై 'మేనేజర్ని చూడ్డానికి వీలవుతుందా' అని అడుగుతూ మెల్లగా 'కొంచెం ప్రత్యేకంగా ఒక్కణ్ణీ కలుసుకోవాలి' ఎందుకట్లా ఒంటరిగా ఒక్కణ్ణీ కలుసుకోవాలన్నానో నాకే తెలియదు అనేశాను నోరు జారింది ఆ ముక్క.

'తప్పకుండా కలుసుకోవచ్చు దానికేమభ్యంతరం?' అంటూ మేనేజరు కబురుచేశాడు

మేనేజరు చూడ్డానికి శ్మశానగంభీరవదనుడు నెమ్మదస్తుడల్లేనే వున్నాడు

'అయ్యా! తమరేనా మ్యానేజరంటూ' అర్ధోక్తిలో ఆగి అడిగాను ఆయన మేనేజరు కావచ్చు కాకుండాపోవని నాకేమీ సందేహంలేదు మరి ఎందుకట్లా అడిగానో ఆ బుద్ధి ఎల్లా పుట్టిందో భగవంతుడికి తెలియాలి చెప్పానుగా అంతకంతకు గందరగోళంలోకి దిగిపోతానని

'అవును నేనే' అన్నాడా పెద్దమనిషి

'ఐతే నేను తమర్ని కలుసుకోవచ్చా?' అంటూ ఆగి 'కొంచెం ప్రత్యేకంగా-' అని అర్థించాను

ఈమారు మిమ్మల్ని ఒంటరిగా కలుసుకోవాలి అన్న అర్థమిచ్చే ముక్క వాడకుండా వుందామనుకున్నాను కాని - అది నోరుజారింది తీరా ఎంత వద్దనుకున్నా.

మేనేజరు కొద్దిగా భయపడుతూన్నట్టు అతను ముఖంలో గాబరాచిన్నెలతో కనుపించాడు చెప్పరాని భయంకరపరమరహస్యమేదో నేను విప్పబోతున్నానని అతను తప్పకుండా అనుకునివుంటాడు

'ఐతే యిలా రండి' అంటూ ఒక ప్రత్యేకమైన కొట్టుగదిలోకి నన్ను నడిపించుకెళ్ళాడు మేం లోపలికి జేరుకున్న తరువాత భద్రంగా తలుపులు మూసి తాళంచెవిని త్రిప్పి నాదగ్గర కొచ్చి 'ఇక్కడ ఏ గోడలకు చెవు లుండవు కూర్చోండి కూర్చుని మీరు నిస్సందేహంగా చెప్పదలిచినది చెప్పవచ్చు'

మే మిద్దరం ముఖాముఖి కుర్చీల్లో కూలబడ్డాం ఏం మాట్లాడ్డానికీ నాకు నోరు పెగిలిరావటం లేదు

'బహుశా మీరు పోలీసుపరిశోధకశాఖా ఉద్యోగి అనుకుంటాను' అన్నాడు బ్యాంకు మేనేజరు సవినయంగా నావిచిత్రప్రవర్తనాదికాల్నుంచి నేనొక డిటెక్టివునని ఆయన పొరబడ్డాడు అతనట్లా నన్ను గూర్చి వూహిస్తున్నాడని తెలియగానే మరీ అధ్వాన్నమైపోతూ—

'అబ్బె! ఇక్కడ డిటెక్టివునికాను నేను' అని అసందర్భంగా ఏదో ప్రేలాను

'అసలు నిజం చెప్పాలంటే—' అంటే నేను యిదివరకు అబద్ధమే చెప్పాలనే వుద్దేశంతో వున్నట్లు—యిప్పుడు నిజం చెప్పబోయేట్లుగా అటువంటి ధోరణిలో 'నేనసలు డిటెక్టివుని కానండీ నేనొక అకౌంటు తెరుద్దామని వచ్చినవాడ్ని అంతే—నా డబ్బు యావత్తూ యిక్కడే, అంటే మీదగ్గరే వుంచుతాలెండి'

మేనేజరు 'అమ్మయ్య!' అని వూపిరి పీల్చుకుంటూ, ఇంకా ఆతురతతో నేనేనొక మహారాజాసంబంధినో—పిల్ల జమీందారుడి కొడుకునో అనుకుంటూ "బహుశా! చాలా పెద్దమొత్తమై వుంటుంది మీ డిపాజిట్టు" అన్నాడు నాకేసి తిరిగి

"అయ్యో! నిస్సందేహంగా—" అని గొణుగుతూ అన్నాను

"ఇప్పుడోమాటు మొత్తంగా ఏభైఆరు రూపాయల డిపాజిట్టున్నూ, తరువాత నెలవారీని ప్రతినెలా యాభైరూపాయల చొప్పునా వేసితీరా లనుకుంటున్నాను"

మేనేజరు గభాల్న లేచి గదితలుపు బార్లా తెరిచాడు అకౌంటెంటును బిగ్గరగా కేకేస్తూ—నిర్దయగా గుమ్మంలోంచే 'ఈయన యాభైఆరురూపాయలు బ్యాంకులో వేస్తార్ట చెలాను రాసి డబ్బుపుచ్చుగో—' అని కేకవేశాడు

నేనూ లేచాను ఎదురుగ్గా గదిలో ఓ ప్రక్కన పెద్ద యినుప దర్వాజా ఓటి తెరిచి

వుంది 'గుడ్‌మార్నింగ్' అంటూ అందులోకి నడిచాను రెక్కపుచ్చుకుని 'ఇటు' అంటూ వచ్చినదారికేసి త్రిప్పాడు

అది బహుశా బ్యాంకు డబ్బుదాచే యినుపపెట్టె గది ఐవుంటుంది

అక్కౌంటెంట్ బోర్డు కట్టివున్న కంత దగ్గరకు తిరిగివెళ్లి నిలబడ్డాను నలుగుర్నీ విస్మయాందోళనలోనుంచే గమ్మత్తు చేయ నుద్దేశించిన వాడిలా డబ్బుమొత్తాన్ని అక్కౌంటెంటు ముఖాని కెదురుగ్గా బోర్లించాను

అప్పటికే నాముఖం గలాటాలో తన్నులు తిని వచ్చినవాడికిమల్లే తెలతెలబోతూ వెలవెలబోతూవుంది 'ఈ మొత్తాన్ని యిక్కడ డిపాజిట్టు చెయ్యాలి!' అన్నా ఏంచేస్తాం యీ శవాన్ని యిక్కడే గొయ్యి తీసి కప్పెట్టాలి, మనిద్దరికీ యీ బాధ తప్పదు అని స్ఫురించేట్టు వుందికామోసు నాముఖం

ఆ డబ్బు తీసుకుని ఇంకో గుమాస్తా చేతుల్లో వుంచాడు అతను నన్నో క్షిప్త మీద యింత మొత్తమని వ్రాయించి ఏదో పుస్తకంలో సంతకం చేయించాడు నేను ఏం చేస్తున్నానో నాకే తెలియకుండా బ్యాంకు నాసొమ్మని నా కళ్ళముందరే హరించి వేసింది చూస్తుండగా

'సొమ్ము బ్యాంకులో పడ్డట్టేనా?' అని సంశయాత్మకంగా ప్రశ్నించాను

'మీసొమ్ము డిపాజిట్టు చేయబడింది. ఇక మీరు వెళ్ళవచ్చు' అని సూచించాడు అక్కౌంటెంటు

'అల్లా ఐతే నేను చెక్కు వ్రాయాలి అనుకుంటున్నాను' అని నామనస్సులోని ఉద్దేశాన్ని వెడలగక్కాను

అస్సలు నే నే మనుకున్నానంటే, ఓ ఆరురూపాయలు ప్రస్తుతం వాడకానికి బ్యాంకులోంచి చెక్కుద్వారా బయటకు తీద్దామని ఓక కంతలోంచి ఎవరో చెక్కుబుక్కు నా కంద చేశారు ఇంకొకరు చెక్కు ఎల్లా వ్రాయాలో తెలియచెప్ప నారంభించారు నాకు వాళ్ళు నేనేదో మిలియనీరనే భావనలో పడి గొణుకుంటు న్నారు ఏదో నాలుగు ముక్కలు నాకు తోచినట్టు చెక్కుమీద వ్రాసి గుమాస్తా ముఖాన పారేశాను అతను చెక్కుకేసి చూశాడు

'ఏమిటి? మొత్తం సొమ్మంతా తీసేస్తు న్నారే?' అని ఆశ్చర్యంగా అడిగాడు హరి భగవంతుడా! యీ ఆరురూపాయలకని చెక్కులో వ్రాశాను కాబోలురా! అని నాకప్పుడు తట్టింది—ఆరురూపాయలకని వ్రాయటానికి ఎందుకట్లా వ్రాశానో ఆ కారణానికి నేను చాలా దూరంగావుండి పోయాను అదీగాక యిప్పుడెందుకట్లా అంత మొత్తానికి చెక్కు వ్రాశానో విడమర్చి చెప్పటం వాళలకు మించిన కార్యంలా తోచింది. అసలా సందర్భం తెలియ చెప్పటం కష్టంగూడా.

ఎవరి పనుల్లో వాళ్ళు వ్రాసుకుంటూన్న గుమస్తాలల్లా పన్లు మానేసి అంతా నాకేసి చూడసాగారు.

నాకు వొళ్ళు మండిపోయింది రిమ్మెత్తుకొచ్చింది.

'అవును మొత్తంసొమ్మంతా తీసేస్తున్నాను'

'బ్యాంకులో వున్న సొమ్మంతా లాగేస్తున్నారే?' తిరిగి రెట్టించాడు ఆశ్చరంతో

'అవును ఒక్క కానీకూడా వుంచను'

'అయితే తిరిగి మీ రే మొత్తమూ డిపాజిట్టు చెయ్యరా?'

'శుద్ధ అనవసరం ఇహ యీ జన్మలో—' అనేసిన మరుక్షణం, ఒకటోరకపు బుద్ధి తక్కువపు టాలోచన నా మెదడులో ప్రవేశించింది వాళ్ళంతా నా కిక్కడేదో అవమానం జరిగివుంటుందనీ— ఏ చెక్కు వ్రాయటంలోనో నాకు కోపంరేగి నా మనస్సు మార్చుకున్నాననీ- అందుకని డబ్బంతా లాగేస్తున్నాననీ బ్యాంకుమీద ఆగ్రహించానని అనుకుంటారనీ ఆశించాను చాలా తొందరకలే స్వభావంకలవాడి లాను, ముక్కోపిలానూ కనపడ్డానికని— కోపిష్టిలా నటించటానికి ప్రయత్నించాను.

నన్నేం బ్రతిమాలలేదు గుమాస్తా డబ్బు తిరిగి యిచ్చివేయటానికే సిద్ధపడ్డాడు.

'డబ్బు ఏడినామినేషన్లో పుచ్చుకుంటారూ?' అని అడిగాడు.

'ఏమిటంటున్నారు?'

'మీకు డబ్బుఏరకంగా కావాలి—పదులా ఐదులా—' 'ఓహ్హో!' గుమాస్తా ఉద్దేశాన్ని గ్రహిస్తూ ఆలోచించటానికి ప్రయత్నించకుండానే 'ఐదు పదులివ్వండి చాలు' అన్నా ఐదుపదిరూపాయల నోట్లు చేతిలో పెట్టాడు.

'మిగతా ఆరుమాటో—' అన్నా తెలివిగా

'ఆరు రూపాయ నోట్లిస్తాను'

ఆరురూపాయలనోట్లు నా చేతిలో పెట్టిన మరుక్షణం, బ్రతుకు జీవుడా అంటూ యివతల కూడిపడ్డాను బ్యాంకులోంచి. నే నింకా గుమ్మందాటకుండానే ఘూనభోంతరాళాలుదద్దరిల్లేలా నవ్వుతున్న ఘోష, నవ్వడి నా వీనులనుతాకింది.

---

చూపిస్తూ 'నిన్నెప్పుడో చంపుతానంటం' కళ్ళారా నేను చూచాను."

"గురుమూర్తి నీళ్ళు నమిలాడు. "పంతులూ! మంచి అవకాశం పోగొట్టుకున్నానోయి. ఎన్నాళ్ళనుంచో గురిలో అంత ప్రావీణ్యం సంపాదించిన గురువు దగ్గర శుశ్రూష ప్రారంభిద్దామని ఉవ్విళ్ళూరాను. ద్రోణుడే మళ్ళీ పునర్జన్మ ఎత్తివుండాలి. ఇంతకీ మాధవయ్య బ్రతికున్నాడా?"

"సరేలే. చెప్పే దేమిటి. ఇప్పుడు కూడా ఆ గదిపేరు మాధవయ్యగదే. చచ్చినా బ్రతికినా ఆ గదిని వదిలేట్లు లేడు. సంవత్సరం పూర్తి ఔతుంది. అద్దె ముట్టకపోయినా కంట్రాక్టుప్రకారం సంవత్సరం కాంగానే నన్నా, గదిని ఖాళీచేస్తే బాగుంటుంది. సరే అసలువిషయానికి ఒద్దాం. మాధవయ్య చేతిచలవవల్ల చచ్చిపోయింది మా నౌకరొక్కడే కాదు. అంతకు వారంరోజులు ముందుగా ఒక ఫిడేలు వాయిద్యగాణ్ణి నిలువునా ప్రాణం తీశాడు.."

"ఏమిటీ! నిజం!. " గురుమూర్తి పెదవి కొరుకున్నాడు.

"అక్షరాలా నిజం. ఆ ఫిడేలు వాయిద్యగాడు ఈ వూరొచ్చి ఒక నెలరోజులైంది. ఎప్పుడూ ఫిడేలువాయించుకుంటూ బజారెంట అడుక్కునేవాడు. పాటలో సొంపు లేకపోయినా కంఠంలో మార్దవం వుంది. సంవత్సరాది వారంరోజులు ముందుగా ఆ ఫిడేలువాయిద్యగాడు మాయింటి ఎదురుగా పాడుతున్నాడు. మాధవయ్య గదిలోంచి ఏం సిగ్నలు వచ్చిందో ఏమో, సరాసరి మెళ్లెక్కి పైకి పోయాడు. అంతే అతను పైకి పోవటం చూచినవాళ్ళేవరూ మళ్ళా అతగాడు కిందికి రావటం చూడలేదు. సరిగదా ఊళ్ళో ఎవళ్ళూ మరునాడు కానీ, తరవాత గాని, ఇప్పటివరకూ అతని సంగతి గాని, సంగీతం గాని ఎరగరు."

"ఊళ్ళో ఎవళ్ళూ భోగట్టా చెయ్యలా?" గురుమూర్తి షెర్లాక్సహోమ్సు మోడల్లో స్టైలిష్‌గా మాట్లాడాడు.

"అబ్బె. అలా అయితే ఇంకేం. ఇనుపగుండులాంటి మాధవయ్యను చూస్తే ఈ ఊళ్లో హడల్. ఎవరిక్షేమం వారు చూచుకున్నారు. అయినా ఆ బిచ్చగాడు చస్తే ఎవరికేం? ఈ ఊళ్లో వాడికి చుట్టాలా, పక్కాలా?" పంతులు నిట్టూర్పు విడిచాడు.

"అహ్హా... ఎంత ఘోరం! ఇదంతా పిశాచకృత్యంలా గుందే.." పంతులును చూచి గురుమూర్తి పళ్లు బిగించాడు.

"అప్పుడే నీళ్లు నమలబోక. ఇంకా వుంది కథ. కిందటి వేసవికాలంలో ఈ ఊరు బ్యాండుమేళం ఒకటొచ్చింది. వాళ్ళంతా బలేగా వాయించేవాళ్ళు. మాధవయ్య ఎలా అయాడో, వాళ్ళలో ఒకడితో ప్రాణస్నేహితుడయ్యాడు. మరునాడెళ్ళిపోతారనంగా బ్యాండుమేళగాళ్ళందరిని ఇక్కడికి భోజనానికి పిలిచాడు. మరునాడు వాళ్ళు వెళ్ళిపోయారు ఈ ఊరునుంచి. అంతే. తిరిగి వాళ్ళెక్కడా బ్యాండు వాయించలేదు సరిగదా సంగీతం అంటే వాళ్ళు కత్తులు కరార్లు పుచ్చుకుంటున్నారు."

"సరేలే చాలా గాథ వుండే ఈ మాధవయ్యసంగతి కాని. కాని అంతా చెప్పెయ్యి." ఎంతో ఆత్రంగా కథను వినాలని ఆత్రపడ్డాడు నా జేబులోనికి స్వతంత్రంగా చెయ్యి పోనిచ్చి 'సిజర్సు' పీకొక్కని వెలిగించాడు.

పంతులు మళ్ళీ ప్రారంభించాడు. మాధవయ్య యింకా ఎన్నో యిలాంటి ఘోరహత్యలు చేశాడు. అన్నీ యిప్పుడు నేను మరిచిపోయాను. ఇదివరకుండే జ్ఞాపకశక్తి చాలా నశించిపోయిందోయ్ గురుమూర్తీ. ఇంకో విషయం నాకు బాగా జ్ఞాపకం వుంది. మాధవయ్యే ఇంకో సంగీత వాయిద్యగాణ్ణి పొట్టను బెట్టుకున్నాడు.

ఇదెంతవరకు నిజమో నాకు తెలీదుగాని కాస్తో కూస్తో మొత్తానికి మాధవయ్య చెయ్యికూడా అందులో వుంది. ఈవూళ్లో తొక్కడు హార్మోనియం నేర్పే ఆయన-60 ఏళ్ళు నిండిన ముసలితొకు ఉన్నాడు. ఆయన అకస్మాత్తుగా చచ్చిపోయాడు. చచ్చిపోవటమే కాకుండా ఆయన బంధువులకైనా ఎవ్వరికీ తెలీకుండా ఎవరో అర్ధరాత్రిన ఆయన్ను ఎత్తుకుపోయి దహనంకూడా చేశారు. మాధవయ్య సరిగా ఆ రాత్రే రెండుగంటలకు ఇంటి కొచ్చి తలుపు తట్టాడు. అంచేత ఆ పెద్దమనిషి చావుతో మాధవయ్యకు కొంతైనా సంబంధ వుండకపోదు..."

పంతులు కాసేపు ఆగాడు. దగ్గాడు. తుపుక్కుమని వుమ్మేశాడు. మళ్ళీ ప్రారంభిచాడు.

"తరువాత మాధవయ్య చచ్చిపోయాడు. మాధవయ్య చనిపోయి రెండునెలలయింది. అప్పటినుండీ ఆ తూర్పువేపు గదిలో పన్నెండు కొట్టింతర్వాత విపరీత ధ్వనులు బయలుదేరతాయి. నాలుగుకొట్టి కోడికూసిందాకా ఆ ధ్వనులు అలాగే వినపడుతుంటాయి. మాధవయ్య దయ్యం అయిపోయాడు. మాధయ్యమీద కసి తీర్చుకోటానికా అన్నట్లుగా ఆ ఫిడేలు వాయిద్యగాడు, మా నౌకరు, హార్మోనియం

వాయించే ఆ ముసలితొక్క అంతా దయ్యాలుగా మారి మాధవయ్యతో రోజూ కొట్లాడుతూండేవాళ్ళు. కోడి కూయంగానే ఆ ధ్వనులన్నీ సమసిపోతాయి. గది వదలేముందుగా అప్పటిదాకా ఘోర యుద్ధం చేసినవాళ్ళంతా మళ్ళీ స్నేహితులవుతారు. మాధవయ్య మామూలుగా తను పడుకునే పడకకుర్చీలో కూచుని చుట్ట వెలిగిస్తాడు. ఫిడేలు వాయిద్యగాడు, తనలా దయ్యంగా మారిన తన ఫిడేలుతో వాయిస్తాడు. దయ్యంగా మారిపోయిన తన హార్మోనియమును వాయిస్తూంటాడు చచ్చిపోయి దయ్యమైన ఆ ముసలితొక్క. చచ్చి దయ్యాలయిన మేళాలను వాయిస్తూంటారుఆబ్యాండువాయిద్యగాళ్లు (ఈరెండునెలల్లోఅంతాఒకరితరువాతఒకరు చచ్చిపోయి దయ్యాలుగా మారిపోయారు.) అంచేత ఆ గదికి మాధవయ్యగది అని పేరెట్టి దాని చాయలకైనా మేము పోము!.." పంతులు కథను ఒక్క పెట్టున పూర్తిచేసి అప్పటిదాక నోట్లో పోషించిన ఉమ్మిని ఖాండ్రించి ఉమ్మేశాడు. గురుమూర్తి చిన్న చిన్నగా సోలుతున్నాడు. నా జేబులోవున్న సిజరు పాకెట్టును అప్పటికి నేను పూర్తిచేసేశాను.

మాంఛి హుషారుగా లేచి "అలా అయితే ఆ గదిలో పడుకోక తప్పదు" అన్నాను మాధవయ్య దయ్యంవిషయం ఏమిటో తేల్చుకోవాలనే కుతూహలంతో. నా మాటలు వినీవినటంతోటే నిద్రతో సోలుతున్న గురుమూర్తి ఎగిరిపడ్డాడు. పంతులు కూర్చున్నవాడల్లా లేచి చిందులు తొక్కుతూ నాలుగువేపులా తుపుక్కు తుపుక్కుమని ఉమ్మివేయ్యటం మొదలెట్టాడు.

"అమ్మో! ఆ గదిలో పడుకుంటావూ? ప్రాణాలమీద ఆశ లేదా యేం? నే నూరుకోను. అదీ గాక ఆ గదిలో ఏముంది. పరుపూ, పక్కా కూడా లేదే..." పంతులు సాకులు వెతికాడు.

"పరుపు లేకపోతేం? మర్సేం ఫరవా లేదు. చాలాకాలం భాగ్యవంతు లిండ్లలో పరుపుమీదే పడుకున్నా. వాళ్ల తాతల కాలంనుంచీ మట్టి ఎరగనివాటిమీద. అంచేత సాకులు వెతకబోకేం. అవేం అతకవు. నే నా కుర్రవాణ్ణి. మాంఛి వయస్సులో వున్నాను. పై పెచ్చు నెలరోజుల నుంచి మనస్సు బాగా స్థిమితంగా వుంది. దయ్యాలూ, భూతాలూ నన్నేం చెయ్యవులే. ఏదో చెప్పి మళ్లీ మీయింట్లో వాటిని కనపడకుండా చేసి పంపుతాను కూడా." కబుర్లు చెప్పాను.

పంతులుకు గత్యంతరం లేకపోయింది. ఎలాయితేనేం కష్టంమీద ఒప్పుకున్నాడు. ముగ్గురం కలిసి మేడెక్కి పోయాం. వాళ్లిద్దరూ నన్ను భద్రంగా గదిలో చేర్చి వెళ్లేప్రయత్నంలో వున్నారు. పంతులు మొగంలో కళ లేదు. గురుమూర్తి ఒణుకుతున్నాడు. ముచ్చెమటలుపోసినాయి. అకస్మాత్తుగా ఏదో చిన్న శబ్దం అయింది, క్షణంలో ఎలా మెట్లుదగ్గరకు దూకాడో గురుమూర్తి. నాకు అగమ్యగోచర మయింది. వాడి వెంటనే పంతులు దూసుకున్నాడ గోచీ వూడిందికూడా గమనించకుండా.

నేను తలుపు దగ్గర కేశాను. పడుకున్నాను. నాకో పిచ్చి వుత్సాహం కలిగింది. ఇంటి కప్పు అమాంతం ఎక్కి దిగాలనిపించింది. ఎలాయితేనేం కోరిక నుచంపుకున్నాను. బుద్ధుడు చెప్పాడుగా కోరిక లుండరాదు అని. ఒకపక్కకు ఒత్తిగిలి టేబిలువంక చూచాను లాంతరు వెలుతురు భరతనాట్యం ప్రారంభించింది. ఒత్తిమీద కిరసనాయిలు పడ్డదో ఏం పాడో! ఇదేం అపశకునంరా బాబూ అని ఆ నాట్యానికి అంతం చెప్పాలని శతవిధాల ప్రయత్నం చేశాను. ఊహూ. ఏం లాభం? ఆరిపోయే స్థితి కొచ్చింది. నాకు ఒళ్లు కాలుకొచ్చింది. రెండుసార్లు గాలిలో తిప్పి ఒక్క పెట్టున విసిరి నేలకేసి కొట్టాను. పెద్ద మోతయింది. గురుమూర్తి, పంతులు గాభరా పడుండాలి నాలో నేను నవ్వుకున్నాను.

నిద్రపోదా మనుకున్నాను. లాభం లేకపోయింది. అసలు నిద్రొచ్చే కళలుకూడా ఆట్టే కనిపించ లేదు. అంచేత చీకట్లో గుడ్లు తెరుచుకుని వెల్లికిలా పడుకుని కప్పువంక తదేకదృష్టితో చూస్తూ పడుకున్నాను. ఏవో పిచ్చి తలంపులు నన్ను పీడించినాయి. ఆలోచిస్తుంటే ఎందుకో నవ్వొచ్చింది. పక్కమంచం ఊగిపోయేట్లు బిగ్గరగా నవ్వాను. ఒక్కసారి భయ మేసింది. నిశ్శబ్దంగా వున్న రాత్రిలో నానవ్వు దయ్యపు నవ్వుగా ప్రతిధ్వనించింది తిరిగేతిరిగే గబ్బిలాలు ఎగిరిపోయినయి. పక్కకు ఒత్తిగిలి చూచాను టేబిలు దగ్గరగా వున్న కుర్చీలో నోట్లో పెట్టుకుని కాలుస్తూ కూచున్నాడు ఎవరో. దయ్యంగా మారిన మాధవయ్యా? ఒళ్లు ఒక్కసారిగా జలదరించింది తమాయించుకున్నాను. పది నిముషాలు శబ్దంలేకుండా గడిచిపోయినాయి. జేబులోంచి సిగరెట్టు తీశాను. వెలిగించాను. ఒంట్లో వేడి ప్రవేశించింది. ప్రారంభించాను.

"ఇవాళ చాలా చలిగా లేదు? ."

"నేను మటుకు చూడలేదు. అయినా మీమాట ఒప్పుకుంటాను." దయ్యం మాట్లాడినట్లు. .ఆశ్చర్యపోయాను.

మళ్ళీ నిశ్శబ్దంగా కొన్ని నిముషాలు గడిచినయి. ఇంకోసారి తిరిగి ఉపక్రమించాను.

"మీ పేరే మాధవయ్యనుకుంటాను. పంతులు నౌకరును మీరే చంపారుగదూ!.."

"ఔను వట్టి శుంఠ .." ముక్కకు ముక్క సమాధానం చెప్పాడు. ఏమీ పశ్చాత్తాపం పడడేం?

ఇంకో ప్రశ్న వేశాను.

"హార్మోనియం వాయించే ఆ ముసలి తొక్కచావులో మీకూ కొంత చెయ్యి వుందని పుకారుగా వుంది. ఏమంటారు?.."

"కొంత చెయ్యి వుందన్నారూ? ఎవరా బుద్ధిహీనులు! నాకెవ్వరూ సాయం చెయ్యలేదు. ఒక్కడినే చంపాను. అర్ధరాత్రి మోసుకుపోయి దహనం చేశాను. చీకట్లో రాయి తగిలి క్రింద పడితే గీరుకుపోయింది మచ్చకూడా పడింది. చూడండి." మొగం చూపించాడు. నిలువునా నీరైపోయాను.

"అయితే ఫిడేలు వాయిద్యగాణ్ణి మీరే చంపారా?.. "

చిరునవ్వు నవ్వాడు.

"ఏ ఫిడేలు వాయిద్యగాడి విషయం మీరు ప్రశ్నించేది?" నిష్కర్షగా తిరిగి ప్రశ్నేశాడు.

"సరేలే ఇంకా ఎంతమంది ఫిడేలు వాయిద్యగాళ్ళున్నారు, మీరు చంపిన వాళ్ళు..."

భయం వేసి నాలుక కొరుక్కున్నాను.

"అయితే బడాయి కొట్టుకోవటం నాకు అలవాటు లేదుగాని, నిజం చెప్పాలిసొస్తే ప్రేతభూమిలో నా కాతా తాలూకు ఫిడేలు గుర్తులు అరడజను పైనే వున్నాయి.. "

'అమ్మ బాబో' కెవ్వు మన్నాను.

పది నిమిషాలు తెలీకుండా గడిచిపోయి వుంటాయి. ఇంతసేపూ మాధవయ్య చుట్టకాలుస్తూనే వున్నాడు. ఇదివరకెప్పుడూ దయ్యాలు చుట్టలు కాలవటం ఎరగను. అయితే మనుషుల్లా ప్రవర్తిస్తయ్యన్న మాట!

"మీకే పొగాకును వాడతారు? సాధారణంగా?" ఉత్సాహంతో ప్రశ్నించాను.

"ఎప్పుడూ నేను చేబ్రోలు పొగాకునే వాడతాను. సమాధానం అడిగిందానికిచెప్పి" ఒక చిన్న పురాణం చెప్పాడు. మనిషి బ్రతికివున్నప్పుడు ఎంత పొగాకు కాలిస్తే అంత పొగాకూ, మనిషి చనిపోయి దయ్యమైపోయింతర్వాత దయ్యమై అతని దగ్గరకు చేరుతుందిట. ఇదివరకు తను బ్రతికివున్నప్పుడు ఎప్పుడూ చేబ్రోలు పొగాకే వాడేవాడుట. మాటలు పూర్తి చేశాడు. నాకు ఆశ్చర్యమేసింది మంచి విషయం నేర్చుకున్నాను. ఇక నుంచీ సిగరెట్లు ఎక్కువ కాల్చి పారేస్తాను.

మళ్ళీ కొంతసేపు నిశ్శబ్దం నిమిషాలను మ్రింగింది. మాధవయ్యనే అడిగాను మిగతా దయ్యాలు—ఫిడేలు వాయిద్యగాడు. హార్మోనియం వాయించే ముసలితొక్క, పంతులు నౌకరూ, బ్యాండువాయిద్యగాళ్లూ—ఎప్పుడు వస్తారన్నాను

మాధవయ్య నవ్వాడు. "అదంతా శుద్ధ అబద్ధం. మొదట్లో వొచ్చే వాళ్ళు అయితే అందరినీ ఒకరి తర్వాత ఒకరిని చంపేశాను. విసిగేసింది ఏం చేస్తాను? అందరూ చనిపోగా చివరికి మిగిలిన ఒక్క బ్యాండువాయిద్యగాణ్ణి మీరు గదిలోకి వచ్చేలోగా చంపేశాను. ఇందాక మీరు విన్న శబ్దంఅదే."

"అలాయితే మీ రొక్కరే రోజూ వస్తారన్నమాట మీరు రాకుండా ఉండకండి ఈ యింట్లో వాళ్ళు విచారపడతారేమో" అన్నాను ఊరుకున్నవాడిని ఊరుకోక.

అకస్మాత్తుగా ఏదో శబ్దం అయింది క్రిందంతస్తులో. ఉన్నవాడున్నట్లు మాధవయ్య ఆపాదమస్తకం ఒణికిపోయాడు క్షణంలో అతని మొగం నిస్తేజమయిపోయింది.

"మీకు జ్వరం తగిలినట్లుంది. పాపం మీ కేం కావాలో చెప్పండి. అమృతాంజనం రుద్దమంటారా? కషాయం తీసియిమ్మంటారా" ఎంతో సానుభూతిగా అడిగాను.

క్షణంసేపు మాధవయ్య ఏమీ మాట్లాడలేదు. ఆ తర్వాత కాస్సేపు విశ్రాంతిగా కూచుని చుట్ట తగలేశాడు.

"మరేం ఫర్వాలేదు లెండి ఇందాక మనకి వినపడింది కోడికూతనుకున్నాను" అన్నాడు తాపీగా.

"అప్పుడే ఏం కోడి! ఇంకా రెండన్నా దాటందే.!" అన్నాను ఆశ్చర్యపోతూ.

"ఈ వెధవకోళ్ళకు బుద్ధి వుంటేగా. అసలు వాటి కొక టైమంటూ వుండాలి వాటికా జ్ఞానం లేదు. వేసవికాలంలో నాలుగ్గంటలకు, శీతాకాలంలో ఆరుగంటలకు కోడి అరవాలి. అలాగయితే బాగుంటుంది. అంతే గాని ఎప్పుడు పడితే అప్పుడు అరవటంవల్ల మాబోటివాళ్ళు చాలా యిబ్బంది పడతారు." ఎంతో యిదిగా అన్నాడు.

"అయితే కోడి మీ సమీపంలో లేకపోతే ఎలా గడుపుతారు?" అని అడిగాను. మాధవయ్య ఏదో జవాబివ్వబోతున్నాడు. అకస్మాత్తుగా కోడికూసింది. ఈ సారి అనుమానానికి అవకాశం లేదు మాధవయ్య లేచి నిలబడ్డాడు

వెళ్లివస్తా నంటూ బిళ్ళమడతలు సర్దుకుంటున్నాడు.

"నేనుకూడా వస్తాను మీతో కాస్త దూరం నడవా లనుంది." అంటూ వెంబడించాను

మాధవయ్యా నేనూ ఒకరిచేతి నొకరు పట్టుకుని గేటుదాటి రోడ్డుమీద కెళ్లాం. రామయ్య కనిపించాడు

"ఏం రామయ్యా! దొంగల భయం ఏమీ లేదుగా అయినా కాస్త జాగ్రత్తగా ఉండటం మంచిది" అంటూ సాగిపోతున్నాను నా పక్కనే మాధవయ్య నడుస్తున్నాడు

రామయ్య నన్ను వదల్లేదు "బాబూ! అయితే అర్ధరాత్రిన ఇలా ఊరిబయటకు బయలుదేరా రేం. నన్నుకూడా రమ్మంటారా ఏమిటి"

"అక్కర్లేదు పో ఇప్పుడే వస్తాను. ఇదుగో. మాధవయ్య నలా పంపించొస్తాను. నువ్వాగులే"

ఇంకో అడుగు ముందుకు వేశాను మాధవయ్య తొందరపడుతున్నాడు. అప్పుడే మూడోసారి కోడి కూత వినిపించింది.

"ఎవరా మాధవయ్యగారు? ఏంబాబూ!" రామయ్య నన్ను వదిలేట్లు లేడు నాకు చిరాకేసింది

"ఓహో! అసలు సంగతి మరిచిపోయాను. మాధవయ్య నీకు కనపడడులే.."

రామయ్య ఎగిరిపడ్డాడు. అమాంతం నా చెయ్యి పట్టుకున్నాడు.

"బాబూ! నిద్రమత్తులో పోతున్నారల్లే వుంది. రోడ్డుచివర నేలభావికూడా వుంది. ఇక పదండి యింటికి. మీకు ఒళ్లు తెలీటం లేదల్లే వుంది. బనీను ఒక్కటే వేసుకుపోతున్నారేం ఇలా.." రామయ్య గట్టిగా వెనక్కు లాగాడు.

నాకు ఒక్క పట్టున ఉడుకుమోత్తనం వచ్చింది. "పోవోయి. అనవసరంగా వాగక. నీకెందుకూ ఈ విషయంలో జోక్యం లేని జోక్యం.. ..."

మాధవయ్యవైపు చూచాను. లేడు. ఎప్పుడెళ్ళాడో ఏమో. ఉత్తమొద్దు. ఆమాత్రం జ్ఞానం వుండఖర్లా ఇంత దూరం వెంటొస్తేను.

విసుగ్గా వెనక్కు తిరిగాను.

అనేకసార్లు పంతులు మాయింటికొచ్చాడు.

ఎప్పుడూ మళ్ళా మాధవయ్య తిరిగి వాళ్లింట్లో కనిపించలేదట. స్నేహితుడి మీద ఆ మాత్రం గౌరవం ఉంచాడు.

(ఒక రష్యన్ కథ ఆధారంగా)

# పురోభివృద్ధిమార్గంలో హైదరాబాద్

శ్రీ కె. వి. శంకర్

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి మూడుసంవత్సరాలైతే హైద్రాబాద్ ప్రజలు స్వతంత్రం పొందింది రెండు సంవత్సరాలకిందట ఈవిధంగా మిగతా దేశంకంటే హైద్రాబాద్ ఒక సంవత్సరం వెనుకబడినప్పటికీ, పురోభివృద్ధిమార్గంలో మాత్రం, మిగతా దేశంకంటే ఒక అడుగు ముందు ఉన్నది

నిజాం నిరంకుశ ప్రభుత్వంనుండి, రజాకార్ల దౌర్జన్యాలనుండి ప్రజలను రక్షించి దేశశాంతిని కాపాడుటకు భారత ప్రజాస్వామ్యప్రభుత్వ సైన్యాలు 1948 సెప్టెంబరు 13 తెల్లవారు ఝామున సైనికచర్య జరపటం ప్రారంభించి 18 వ తేదీ కల్లా పూర్తిచేసినవి సంస్థానాన్ని మతరాజ్యంగా తయారుచెయ్యాలనీ, ఇండియాతో సంబంధంలేకుండా హైద్రాబాద్ ప్రత్యేకంగా స్వతంత్ర రాజ్యమనీ దంభాలుపలికిన ఇత్తేహాదుల్ ముసిల్మీన్ నాయకుడు కాశింరజ్వీ మొదలగువారు అరెస్టుచేయబడినారు నాయకులైతే అరెస్టు చేయ బడినారుగాని వారి అనుచరులు యింకా గ్రామ ప్రాంతాల్లో ఉండి దౌర్జన్య చర్యలు జరుపుతూనే ఉన్నారు అందుచే యీదౌర్జన్యాన్ని నిర్మూలించి శాంతి భద్రతలను పునరుద్ధరించుటకు మిలిటరీ గవర్నరు ప్రభుత్వం ఏర్పాటు చేయవలసి వచ్చింది



ముఖ్యమంత్రి
శ్రీ యం. కె. వెల్లోడి

ఒక్క రజాకార్లేకాకుండా యింకా అనేక రకములైన సంఘవిద్రోహశక్తులకు హైద్రాబాద్ సంస్థానం ఆలవాలమై ఉండటంచేతకూడ యీప్రభుత్వం ఏర్పడటం తప్పనిసరి అయినది

ఈ ప్రభుత్వం పేరునకు మాత్రమే మిలిటరీ ప్రభుత్వంగాని ఆచరణలో మామూలు సివిల్ ప్రభుత్వం లాగానే వ్యవహరించింది

దేశం పురోభివృద్ధి నొందుటకుముందు శాంతి భద్రతలు సంపూర్ణంగా నెలకొనవలెనని గుర్తించి విధ్వంసకశక్తుల నిర్మూలనకు శక్తికొలది ప్రయత్నించి, ఈ కార్యక్రమంలో మిలిటరీ ప్రభుత్వం చాలవరకు విజయం సాధించిందనియే చెప్పవచ్చును

ఈకాలంలోనే నిజాంస్వంత భూములైన సర్ఫ్‌కాలు రద్దుచేయబడి ప్రభుత్వ భూములలో కలిపి వేయబడినవి హైద్రాబాద్ జాగీర్ల రద్దు నిబంధన అమలు జరుపబడి, జాగీర్లు రద్దుచేయ బడినవి ఇంతేగాక భూసంస్కరణ అమలుజరిపి, వ్యవసాయ ఫలసాయము నభివృద్ధి చేయవలెనను తలంపుతో ప్రభుత్వానికి యీ విషయంలో తగు శిఫార్సులు చేయటానికిగాను మైసూరు మాజీ దివాన్ న్యాయపతి మాధవరావు పంతులుగారు అధ్యక్షులుగా భూసంస్కరణల సంఘాన్నొకదానిని నియమించటం జరిగింది ఈ సంఘంవారు తమ కార్యక్రమమును నిర్వహించి ప్రభుత్వానికి నివేదిక సమర్పించారు ఇందులో వివరించబడిన శిఫార్సులు అత్యుత్తమంగా ఉన్నవి శతాబ్దాల తరబడి, నిరంకుశత్వంలో మగ్గిపోయిన రైతులపరిస్థితి యీ సిఫార్సులు అమలు జరుపబడినప్పుడు, చాలవరకు చక్కబడగలదనుటలో సందేహమేమీ లేదు

శాంతి భద్రతల పునరుద్ధరణ కార్యక్రమం చాలవరకు పూర్తి అయిన వెంటనే మిలిటరీ గవర్నరు ప్రభుత్వం స్థానే ఎం. కె. వెల్లోడీ ముఖ్యమంత్రిగా సివిల్ ప్రభుత్వం ఏర్పాటుచేయబడింది

మిలిటరీ ప్రభుత్వ కాలంలోనే సంస్థాన



రెవిన్యూమంత్రి
శ్రీ బూర్గుల రామకృష్ణారావు

రాజ్యాంగపరిషత్తును ఏర్పాటు చేయుటకుగాను వయోజన ఎన్నికపద్ధతిపై ఎన్నికలు జరుపుటకు ప్రయత్నం జరిగింది కాని దేశమంతటికీ 1951 లో సర్వవ్యాప్త ఎన్నికలు జరుగనుండుటచే వాటితోపాటే సంస్థానంలోకూడ ఎన్నికలు జరుపుటకు నిర్ణయం జరిగింది దీనివల్ల సంస్థానంలో రాజ్యాంగ పరిషత్తు ఏర్పాటుచేయటం విరమించబడింది

అయితే నిజాం నిరంకుశ ప్రభుత్వంనుండి విమోచన పొందుటకు పోరాటం నడిపిన ప్రజలు సంస్థానంలో ప్రజా ప్రభుత్వం ఉండాలని కోరటం సహజం వెల్లోడీగారు



కార్మికమంత్రి
శ్రీ వల్లూరి బసవరాజు

ముఖ్యమంత్రిగా నున్న ప్రభుత్వం సివిల్ ప్రభుత్వమైనప్పటికీ ప్రజా ప్రభుత్వం కానేరదని వారి భావం ఈ విషయాన్ని గురించి సంస్థాన ప్రజలకు ప్రాతినిధ్యం వహించుచున్న సంస్థాన కాంగ్రెస్ భారత ప్రభుత్వ అధినేతలతో అనేకమార్లు రాయబారాలు జరిపింది కాని సంస్థానకాంగ్రెస్ చీలికలై వర్గాలేర్పడుటంవల్ల సంపూర్ణప్రజా ప్రభుత్వం ఏర్పాటు చేయటానికి యిది అదనుకాదని అగ్రనాయకులు భావించారు. ఇదేగాక సంస్థానంలోని కొన్ని కొన్ని ప్రాంతాలలో యింకా సంఘ విద్రోహ చర్యలు చెదురుగానైనప్పటికీ జరుగుతూనే ఉన్నవి దీనివల్ల కూడ అగ్రనాయకులు పై విధంగా భావించటానికి వీలు ఏర్పడింది

సంస్థాన కాంగ్రెసులోని విభేదాలకు



సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు
శ్రీ దిగంబరరావు బిందు

కారకులెవరూ, అని విమర్శ చేయటానికి కిక్కడ తావు లేదు ఎందుచేతనంటే సంస్థాన కాంగ్రెస్ వాదులందరు సంస్థాన క్షేమాన్ని, ప్రజల శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని పరస్పర విభేదాలను చంపుకొని ఐకమత్యంతో దిగంబరరావు బిందూ గారిని అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు ఇది ఎంతయు ప్రశంసనీయమైన విషయం ఎందుచేతనంటే యితర రాష్ట్రాలలో కూడ కాంగ్రెస్ వాదుల్లో విభేదాలున్నవి. అయితే వారు రోజురోజుకి తమ విభేదాలను పెంపొందిస్తున్నారేగాని హైద్రాబాద్‌లో మాదిరిగా ప్రజల శ్రేయస్సే ప్రధానంగా భావించి ఐకమత్యానికి రావటంలేదు ఈ విషయంలో హైద్రాబాదు మిగతా దేశానికి మార్గదర్శకమయినది

సంస్థాన కాంగ్రెస్ వాదులలో ఐకమత్యం కుదిరి ఏకగ్రీవంగా అధ్యక్షుని ఎన్నిక జరిగిన అనంతరం ప్రజాప్రభుత్వం



ఆహారశాఖామంత్రి
శ్రీ వినాయకరావు విద్యాలంకార్

ఏర్పడాలనే వాంఛ ప్రజలలో ప్రబలమవసాగింది ప్రభుత్వంలో తమ నాయకులున్నారనగానే ప్రజలు ప్రభుత్వంవారు అమలుజరిపే ప్రజాభ్యుదయ కార్యక్రమాలకు సంపూర్ణసహకారాలిచ్చి, సంస్థానాభివృద్ధికి, తద్వారా దేశాభివృద్ధికి కృషిచేసే అవకాశం ఎంతో ఉంది అగ్రనాయకులు యీ విషయాన్ని గురించకపోలేదు గుర్తించిన వెంటనే వెల్లోడీ ప్రభుత్వంలో కాంగ్రెస్ ప్రతినిధులకు స్థానం కల్పించటాన్ని గురించి ఆలోచన చేశారు

1950 మార్చినెల ప్రారంభంలో హైద్రాబాద్‌కు లోగడ ప్రధానిగా ఉండి సంస్థానంలో అరాజకాన్ని రేకెత్తించినటువంటి లాయకాలీ ఇంటి నిర్బంధంనుండి భార్యకుమార్తెలతో సహా పరారీ అయినాడు ఇది ఎవరిలోపంవల్ల జరిగినది అన్న విషయంఎట్లా ఉన్నప్పటికీ, ప్రజాప్రభుత్వంలేకపోవటం



స్థానిక స్వపరిపాలన-శాఖామంత్రి
శ్రీ ఫూల్ చంద్ గాంధి

వల్లనే యిది జరగటానికి వీలయిందని ప్రజలు భావించటం ప్రారంభించారు ప్రజాప్రభుత్వం ఉండాలన్న ప్రజలకోరిక యీ పరిస్థితివల్ల వృద్ధిపొంద సాగింది తత్ఫలితంగానే యీవిషయంలో అధికార, అనధికార, వర్గాలకు సంప్రదింపులు జరిగినవి,

ఈ విషయంలో ముఖ్యంగా వెల్లోడీ, దిగంబరరావు బిందూగార్లు చేసిన కృషి ప్రశంసాపాత్రము వీరి కృషి ఫలితంగా 1950 జూన్ రెండవవారంలో సంస్థాన కాంగ్రెస్ తరఫున నలుగురికి వెల్లోడీ ప్రభుత్వంలో స్థానం ఒసంగబడింది ఈ నలుగురు కూడ రాజకీయరంగంలో ఎంతో అనుభవంగలవారు సంస్థాన పరిస్థితులు ప్రజల మనస్తత్వం పూర్తిగా తెలిసినవారు



ఆర్థికమంత్రి
శ్రీ సి. వి. యస్. రావు

వీరిని మంత్రులుగా తీసుకొనటంతో సంస్థాన ప్రజలు ఎంతో హర్షించారు.

రెవిన్యూ, విద్యాశాఖల మంత్రిగానున్న బూర్గుల రామకృష్ణరావుగారు, కార్మికశాఖామంత్రిగానున్న కల్లూరి బసవరాజు గారు, ఆహారశాఖామంత్రిగానున్న వినాయకరావు విద్యాలంకార్ గారు, స్థానిక స్వపరిపాలన శాఖామంత్రిగానున్న ఫూల్‌చంద్ గాంధిగారు ప్రజల అభివృద్ధికి ఎన్నో పథకాలు అమలు జరుపుతున్నారు సంస్థానాన్ని అన్ని విధాలా ముందుకు తీసుకొనిపోవటానికి శక్తికొలది కృషి చేస్తున్నారు అధికారంలోకివచ్చి కొద్దికాలమే అయినప్పటికీ యింతవరకు వీరు యీ మార్గంలో చేసిన కృషి ప్రశంసనీయం దేశంలోని మిగిలిన రాష్ట్రాలు హైద్రాబాద్ ను మాని ఈ విషయంలో అనుసరించదగలవు

ఇప్పుడు సంస్థానంలో విధ్వంసక చర్యలు చాలవరకు అణగిపోయినవనే చెప్పవచ్చును భారతసర్వసేనాని కరియప్పగారు యిటీవల సంస్థానకల్లోల ప్రాంతాలలో పర్యటించి సంస్థానంలో సంపూర్ణమైన శాంతి భద్రతలు



పబ్లిక్ వర్క్స్ మంత్రి
**నవాబ్ జైన్‌యార్ జంగ్**

పునరుద్ధరింపబడిన వంటనే కల్లోల ప్రాంతాలలోని సైనికశిబిరాలను ఎత్తివేయటమవుతుందని ప్రకటించారు దీనికి ప్రజలుహర్షింపగలరు పోలీసు చర్యకుముందు ఆ తర్వాత కూడ అనేక కష్టాల పాలైన రైతులకు పునరావాసం కలుగజేయు నిమిత్తం వారికి తక్కువ ఋణములు యున్నసునవి యివ్వబడినవి జాగీర్లు రద్దు చేసినందుకుగాను పరిహారంగా 18 కోట్ల రూపాయలు నిర్ణయించారు దీనిని దాదాపు 20 సంవత్సరాలలో వారికి ముట్టజెప్పటకు నిర్ణయం జరిగింది పరిహారం చెల్లింపువల్ల సంస్థాన ప్రభుత్వం ఏవిధమైన ఆర్థిక చిక్కులకు లోనుగాకుండా ఉండవలెననే ఉద్దేశ్యంతోనే



చార్ మినార్

యీవిధమైన నిర్ణయం చేయబడింది ఇందులో మొదటివిడత మొత్తం అక్టోబరు నెలలో ప్రారంభించటానికి కూడ ప్రయత్నం జరుగుతున్నది

హైద్రాబాద్‌లో మతరాజ్యం ఏర్పాటుచెయ్యాలని అహోరాత్రాలు కృషిచేసి, అనేక దౌర్జన్య చర్యలు జరిపిన కాశిం రజ్వీకి ప్రత్యేక న్యాయవిచారణ సంఘం వారు యిటీవలనే యావజ్జీవకఠిన కారాగార శిక్ష విధించారు

హైద్రాబాద్ ప్రభుత్వం సంపూర్ణంగా ప్రజాప్రభుత్వం కాకపోయినప్పటికీ ప్రజల శ్రేయస్సుకు, అభివృద్ధికీ, అనుకున్న పథకాలను, ప్రణాళికలను సాధ్యమైనంత త్వరలో అమలు జరుపుతున్నది

ఈ విషయంలో కూడ హైద్రాబాద్ మిగిలిన రాష్ట్రాలకంటె ముందున్నదని చెప్పక తప్పదు ఇంతేగాక తూర్పు బెంగాలులో మతోన్మాదానికి గురి అయిన కాందిశీకులకు సంస్థానంలో పునరావాసం కల్పించబడుతున్నది ఈ విధంగా హైద్రాబాద్ అంతరంగికంగా తనపరిస్థితి చక్కజేసుకోవటమేగాక నిస్సహాయులయిన బయటికాందిశీకులకు ఆతిథ్యంయిస్తూ పురోగమిస్తున్నది



హోంశాఖామంత్రి
**శ్రీ యం. శేషాద్రి**

20.9.50

సినిమా:

# దుస్థితిలో ఉన్న ఫిలిమ్ పరిశ్రమ

**భా**రతదేశానికి స్వాతంత్ర్యం లభించి అప్పుడే పూర్తిగా 3 సంవత్సరాలు నిండినాయి ఈ మూడేళ్ళలో ముఖ్యంగా భారతీయుల చలనచిత్ర పరిశ్రమ సాధించిన దేమిటి ? అది ఎంతవరకు మంచిది ఎంత వరకు చెడ్డదనేది మన మిప్పుడు తెలుసుకోవాలి గడచినదానిని బట్టి చూడగా, గడవబోయేకాలంలో నిరాశ నిస్పృహ అధికముకానున్నట్లు తెలుస్తున్నది తయారయిన చిత్రాలు ఏవయినా కానీయండి, అవి అనేక లోపాలతో నిండిఉన్నాయి. కళా ప్రతిభ ఎప్పుడయితే లోపించిందో అప్పుడే వానిలో విజ్ఞానము, విజ్ఞానముతో బాటు వినోదముకూడా నశించినయి అంటే వానిలో తగిన వాస్తవికత కల కథ, నటన, సంగీతము, మున్నగునవి లేకపోవటము. మన ప్రొడ్యూసర్ల మూర్ఖవాదనే ఇందుకు ముఖ్యకారణం.

కాలచక్రములో ఒక సంవత్సరం గతించినదంటే, అది తిరిగిరాదని వీరు గ్రహించినట్లు లేదు. వీరికి తోడుగానున్నారు మన మంత్రులు వీరు మొగల్ చక్రవర్తులకు సరితూగియున్నారు. కాని వీరు ఎప్పుడో కొన్ని వేల సంవత్సరాల క్రిందటి విషయాలనుగురించి చెప్తున్నారే కాని, ప్రస్తుతవిషయాలనుగురించి ఏమీ పట్టించుకోరు.

పరిశ్రమకు 36 సంవత్సరాలు గడచినప్పటికీ ఇంకా బాల్యదశలోనే ఉన్నదని వీరు చెప్పుచున్నారు

స్వాతంత్ర్యోదయానికి ముందు మన పరిశ్రమ అతి తెలివి, అజ్ఞానము, అశ్రద్ధ ప్రదర్శించింది. నేటికయినా పారిశ్రామికులు ఈ లోపాన్ని గుర్తించనే లేదు ఫిలిమ్ పరిశ్రమలో కొంత మార్పువచ్చిందని వీరు తప్ప మిగిలినవారందరూ ఒప్పుకుంటారు. అంతేగాక ఈనాటి ప్రొడ్యూసర్లు తమ చిత్రాలను కళాఖండాలని వర్ణించుకుంటున్నారు. బాక్సు ఆఫీసువద్ద దెబ్బ తిన్నాయంటే అది వీరి దురదృష్టమనాలి. అంతేగాక ప్రభుత్వము పన్నుల నధికం చేసింది. కావలసినన్ని థియేటరు నేటికి కూడా వీరికి లభించకపోవటం శోచనీయం అసలు వచ్చిన మార్పే ఇది. ప్రొడక్షన్ ఖర్చు ప్రొడక్షన్‌లో ఉన్న చిత్రాల సంఖ్య పెరిగి పోయినాయి.

అంటే కేవలం చిత్రాల సంఖ్య హెచ్చిందే కాని ప్రయోజనం శూన్యమే. లెఖ్ఖలు దొరికినంతవరకు 1949 ఆగస్టు మొదలు 1950 జూలైవరకు 275 చిత్రాలు ప్రొడక్షన్‌లో ఉన్నాయి అందులో 190 చిత్రాలు విడుదలయినాయి. కాని వీనిలో చెప్పుకోతగ్గవి కనీసం నాలుగయినా ఉన్నాయా అనేది సంశయాస్పదమైన విషయం ఎంత సెల్యులాయిడ్ వృథాఅయిందో చూడండి!

బ్రిటిషుప్రభుత్వ మున్నరోజుల్లో వారిని నిందించడం, నేటి తమ ప్రభుత్వాన్ని నిందించడం పరిపాటయింది పారిశ్రామికులకు స్వాతంత్ర్యసిద్ధికి ముందు వీరు ఎంత

శ్రీ కృష్ణగోపాల్

సన్మార్గములో నున్నారో, ఇప్పుడు అంత అక్రమమార్గంలో పడిపోయారు. కాని పరిశ్రమబాల్యదశలోనే బాగా ఉందని పిస్తుంది. అందుకు ఉదాహరణ రామశాస్త్రి, పడోసి, ఔరత్, దునియా నమానే మొదలైనవి.

నేటి చిత్రాలలో గల లోపాలకు ఈ క్రింది కారణాలు ముఖ్యమైనవని చెప్పవచ్చును.

కథా : మన చిత్రాల అపజయానికి ఇదొక ముఖ్యకారణము. నేటి చిత్రాల కథావస్తువులో పటుత్వము లేదు. కథకు సన్నివేశాలకుసంబంధము లేదు ప్రొడ్యూసర్లు, డైరక్టర్లు, తమ స్టూడియోలలో కూర్చుని భ్రమాలోకంలో అల్లుకున్న కథలే తయారవుతున్నాయి. కథకులపై వీరు స్వారీ చేస్తున్నారు వ్యాపారరీత్యా తీసిన చిత్రాలనే పేరులు మార్చి తిరిగి తిరిగి చిత్రాలు తీస్తున్నారు. అంతే గాదు. మన శాస్త్రాలను సిద్ధాంతాలను నాశనం చేస్తున్నారు

పైగా పత్రికల కిచ్చే ఎడ్వర్ టైజ్‌మెంట్లలో హృదయరంజకం, ఉభయతారకం, హృదయ విదారకం మొదలైన విశేషణాల్ని చిత్తంవచ్చినట్లు తగిలించి తమకు కావలసినన్ని పాటలు, అసందర్భపు సంగీతంతో నింపి, నిలువునా మనగొంతు కోస్తున్నారు మనల్ని గాఢాంధకారంలోనుంచి అగాధంలోకి తీసుకుపోతున్నారు.

మన ప్రొడ్యూసర్లు తమ కథలకోసం ఎంత ధనం వ్యయపరుస్తున్నారో, పాశ్చాత్యులు ఏమాత్రం వ్యయపరుస్తున్నారో పోల్చుకోవచ్చును కథాసంవిధానంలో, శిల్పంలో వీరి శ్రద్ధకూడా అందరికీ తెలిసినదే ఏ అభ్యుదయ యువక కథకుడో వీరి ఇనుపసంకెళ్ళను తెంచి లోనికి ప్రవేశించినప్పుడు వారిని నిరుత్సాహపరిచి అభివృద్ధిని నిరోధిస్తున్నారు కొంతమంది రచనల్ని తీసుకొని పిమ్మట వానికి సరైన విలువనియ్యక ప్రొడ్యూసర్లు తమ యిష్టానుసారంగా ఆరచనల్ని మార్చుకుంటున్నారు. దీనివలన కథకుల ఉద్దేశ్యమొకటి, చివరికి వొచ్చే దొకటి అవుతోంది. ఫిలిమ్ కథా రచనకు ఉద్వాసనం చెప్తున్నారు. మరికొంతమంది రచనల్ని తీసుకొని తమ ఆఫీసులో పెట్టుకుకూచుని ఎప్పుడో వారి యిష్టం వచ్చినప్పుడు వాటిని తిరిగి వ్రాయించో, లేదా అనువదించో తమ స్వంతమని డబ్బా కొడ్తున్నారు ఇంతకన్న నీచమయినది, హేయమయినదీ మరొకటున్నదా?

## అర్థంలేని సంగీతం

నేటి చిత్రాలలో సంగీతానికి ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చి ప్రేక్షకుల్ని ఆనందింపచేయవలె ననుకొంటున్నారు కాని దానికి బదులు ప్రేక్షకులకి ఈ సంగీతం నానాటికి దుర్భరమౌతున్నది. నిర్మాతలు పాటల ఉపయోగం తెలియక వారియిష్టం వచ్చినచోట పెడుతున్నారు. కాని వీరు ప్రవేశపెట్టిన సంగీతం ఏమాత్రం ఉన్నతస్థితికి రానేరదు. ముఖ్యంగా నాయికా నాయకులు ఏడ్చేటప్పుడు, నవ్వేటప్పుడు, మాట్లాడేటప్పుడు, పుట్టినది మొదలు చచ్చేవరకు పాటలు, సంగీతం నింపి చంపేస్తున్నారు. కాని ఒకందుకు సంతోషించాలేమో! నిద్రించేటప్పుడు ఏపాటగాని పెట్టడంలేదు! నేటి ఈపాటల కూర్పు సంగీతాన్నంతటినీ పాడుచేసింది.

క్రమమార్గంలో పాటలు, నృత్యాలుండకపోవడంవల్ల సంగీత కూర్పరుల (Music Composers) పని తనంలో

విసువు, పాండిత సడలిపోతున్నది. శివుడు, రంభ మొదలయినవారు అపహాస్యపుపాటలు, ట్విములు అంతేగాక సంకరజాతి సంగీతం ఒకటి తయారయింది. అటు పాశ్చాత్యులదో, ఇటు భారతీయులదో ఆ సంగీతం తెలుసుకోటం కష్టమయిపోతోంది. వీనుల విందు చేకూర్చడానికి బదులు, కర్ణకఠోరమై ఈసంగీతం చెవుల్లోసూదులవలె గ్రుచ్చుకొని ఏహ్యం జనింపచేస్తున్నది.

**స్టార్ వాల్యూ:—** ఈరోజుల్లో ప్రొడక్షన్ ఖర్చు పెరిగిపోడానికి స్టార్ విలువకూడా ఒక ముఖ్యకారణమే. తారల కెంత విలువ ఉన్నదో, నేపథ్య సంగీతపాటకులకు (Play - Back - Singers) కూడ అంతే విలువఉంది. ముఖ్యంగా ప్రతిప్రొడ్యూసర్ నేడు ఈవిషయమై మాట్లాడేవాడే కాని దీన్ని ఏవిధంగా రూపుమాపాలో ఒక్కడికీ తెలియదు. లేకపోతే చెప్పదలచుకోలేదేమో!

ఒక్కొక్క తార ఈనాడు కనీసం ఏ ఆరుచిత్రాలలోనో బుక్ అయిఉంటుంది. అందువల్ల నిర్మాణంలో ఆలస్యం సంభవిస్తున్నది. ఇది పరిశ్రమకు అనర్థకం తెచ్చి పెడుతు రిజమైన కళోపాసకుడు దీనివల్ల బాధపడుతున్నాడు. ఒక నటుడు లేదా నటిగాని ఇన్నిపాత్రలకు ఎలా తగి ఉంటారో తెలియదు. దీనివల్ల పాత్రౌచిత్యం నశిస్తున్నది. ఆర్థిక పరిస్థితి హీన మౌతున్నది.

అన్నీ అసందర్భపు కార్యములే కాని చెప్పుకో తగ్గ గుణం ఒక్కటీ లేదు. అందువలన గతించినదానిని గూర్చి వ్రాయడం అనవసరమని తట్టుతున్నది. ఒక్కటి మాత్రం స్పష్టం. ప్రొడక్షన్‌లో వేగం, టెక్నిక్‌లో అనగా సౌండ్ రికార్డింగ్, ఫోటోగ్రఫీలో నైపుణ్యం హెచ్చినవి. అన్ని ఫిలిమ్ సంస్థలను కేంద్రీకరించి ఏకైక సంస్థగా తయారయింది." ఫిలిమ్ ఫెడరేషన్ దేశంలో ఉన్న సెన్సారు బోర్డులన్నింటినీ కేంద్రీకరించి సెంట్రల్ సెన్సార్ బోర్డును స్థాపిస్తున్నారు. "ఫిలిమ్ విచారణ సంఘము" ఒకటి ఏర్పడింది.

### సెన్సార్ షిప్

సెన్సార్ షిప్పును గురించి క్లుప్తంగానయినా వ్రాయక తప్పదు. ముఖ్యంగా అశక్తులయిన సభ్యులప్రవర్తన శుష్కప్రియాలు శూన్యహస్తాలవలె ఉన్నది.

నిజము చెప్పవలసివస్తే సెన్సార్ బోర్డువల్ల పరిశ్రమకు తీవ్రమయిన హానియే కలిగింది. అసలు ఇది ఎందుకు ఏర్పడిందంటే నిజమయిన కళారాధన అంటే ఏమిటో ప్రజలకు అందించడానికే కాని కొందరికి పదవులు ముట్ట చెప్పడం కోసం కాదు. చిత్రాలలో అవినీతి,అసందర్భపు దృశ్యాలు, మాటలు, పాటలను తొలగించటానికి ఈ బోర్డుకు అధికార మీయబడింది. నేడు బోర్డుసభ్యులు ప్రొడ్యూసర్లచేతి కీలుబొమ్మలవలె ప్రవర్తిస్తున్నారు. అందువల్ల చిత్రాల విడుదల అనంతరం కాని వీరు అసభ్యమంటే ఏమిటో తెలుసుకోలేక పోతున్నారు. కొన్నిచోట్ల ప్రొడ్యూసర్లు వీరు ఏకమై చిత్రాలు నిర్మిస్తున్నట్లు తెలియవస్తున్నది. వీరి మూలంగా ఫిలిమ్ టెక్నిక్ దెబ్బతింటున్నది ఈ కారణాలవలన పరిశ్రమ ఎంత వెనుకంజ వేస్తున్నదీ తెలుస్తున్నది. ఈ విషయమై గత సంవత్సరమే ఆందోళన ప్రారంభమయింది. కాని కాలం వ్యర్థమయింది. ఈ సంవత్సరమైనా చెడ్డవేగాని మంచి చిత్రాలు వచ్చే ఆస్కారమేమీ గోచరించడం లేదు ఇదంతా దైవాధీనం కాబోలు

**పౌరాణికాలు:** నేటివరకు ఏడాదికి 28 చిత్రాలు పౌరాణికాలు తయారవుతున్నట్లు తెలుస్తుంది. అసలు పౌరాణికమంటే ఏమిటో వీరు తమ చిత్రాలద్వారా మనకు తెలుప నున్నట్లు కన్పిస్తున్నది. ఏ వూరు పోయినా, ఏ హాలుకు పోయినా దేముడే! దేముళ్లే అంత చౌకయ్యారు కాబోలు. వీరే మనలను వినోదింపచేయనున్నారనుకోవాలి

ఈరోజుల్లో పౌరాణికాలలో పటుత్వమంటే నిర్మాతలకు బాక్సు ఆఫీసువద్ద ఏవిధంగా నాలుగు డబ్బులు వస్తాయో అదే అర్థం. కొంతమంది ప్రొడ్యూసర్లు విజ్ఞాన చిత్రాలవలన మాకేం లాభం" అంటున్నారు అసలు ప్రొడ్యూసర్లకు విజ్ఞానముండి,విజ్ఞానమంటే ఏమిటో తెలుస్తేకదా వారికి విజ్ఞాన చిత్రాల తోటి పని?

భారతీయులు విసుగు చెంది పోయారు వీనితో. ఎప్పుడూ ఒకేరూపాలు, ఒకే ఆకారాలు, ఒకేమనిషి. అదే చూడవలసిందేగాని నేటి జీవనాన్ని గురించి తెలుసుకోవాలంటే ఒక్క చిత్రమయినా లేదు ప్రొడ్యూసర్లయినా నేటి ప్రేక్షకులను శతాబ్దాలాది వెనుకబడివున్న పురాతన కథలలోని దేముళ్ళను చూడటానికి మళ్ళిస్తున్నారుగాని దీనివలన అణుమాత్రమయినా లాభముంటుందా అనే ఆలోచనే లేదు ప్రేక్షకులకు ఏది అయిష్టము, ఏది చెడ్డ అని అనుకుంటున్నారో అదే ప్రసాదిస్తున్నారు. కాని ఒక్క సంగతి మాత్రం వీరు గమనించాలి. వీరి ఆటలు ఆడేకాలం సాగివు దేనికయినా ఈ పౌరాణికాలకయినా, హద్దు అనేది వుంది. వీరి యిష్టానుసారంగా దేముళ్ళ రూపాలను అపహదర్భంగా చిత్రించడం సాగదు వీటివలన పారిశ్రామికులలోనే ఒక పెద్ద తిరుగుబాటు రావచ్చును. దీనికి ముఖ్యకారణం ప్రేక్షకుల అసంతృప్తి. ఎంతకాలం హైందవులు తమ దేవుళ్ళను చౌకచేస్తుంటే చూస్తూ సహించగలరు?

ఒకసారి ఒక అమెరికన్ స్నేహితుడు ఒక ఎడ్వర్ టైజ్ మెంట్ చూచి పౌరాణిక చిత్రాన్ని చూచివచ్చి నాతో యిలా అన్నాడు. "నిజంగా మీ దేవుళ్ళ స్వరూపాలేనా ఇవి? ఏం రూపాలయ్యా!" ఇక వేరే సమీక్షించ నవసరము లేదు ప్రొడ్యూసర్ల దృష్టిలో దేవుళ్ళు అంటే సమ్మడి కాయవంటి బొజ్జలతో నిత్యం స్త్రీ సాంగత్యంకోసం తహతహలాడేవారని కాబోలు!

నన్ను ప్రశ్నిస్తే నేను తిరిగి జవాబు చెప్పలేనేమో! ఎందుకో అది మీరే చెప్పండి అసలు నేనే కాదు, ఎవరైనా జవాబు చెప్పలేరు మనకు పౌరాణికాలే ఈసంవత్సరంకూడా ఎక్కువవస్తున్నాయి కొన్నాళ్ళకు ప్రొడ్యూసర్లే దేముళ్ళుగా మారి, వారి చరిత్రలే మనకు సాక్షాత్కరింపనున్నట్లు, చూపనున్నట్లు అనుమానం కలుగుతున్నది. నాగరికత, ప్రపంచజ్ఞానం, మోక్షం అనే మిషలతో అవిత, ధైర్యోత్సాహాలు ప్రదర్శించి రాక్షస సంహారం సాగిస్తున్నారు. వీరూ నేటి ఈ ప్రొడ్యూసరు మహాశయులు.

[మూవీ టైమ్సు పత్రికనుంచి]



ఆంధ్రబ్యాంక్ తిరుపతిశాఖ ప్రారంభోత్సవానికి అధ్యక్షతవహించినతిరుపతి దేవస్థానం కమీషనర్ శ్రీ సి. అన్నారావుగారు.



మూలం:
అర్కాడి గైదార్

అనువాదం:
కృష్ణ ప్రసాద్

ఆ నీలపు పర్వతాల ప్రక్క అడవుల్లో నివసిస్తూ ఉండే వాడాయన. ఎంతో కష్టించి పనిచేసే వాడు. అయినా ఇంకా చేయాల్సిన పని ఉంటూనే ఉండేది. శెలవుల్లో గూడా ఇంటి కెళ్లడానికి వీలుపడేది కాదు.

శరదృతువు వచ్చింది. ఒంటరి జీవితంతో విసుగెత్తి, చివరికి పిల్లల్ని తీసుకుని ఒకసారి వచ్చి చూసివెళ్ళమని భార్యకి రాయాలని నిర్ణయించుకున్నాడు.

ఆయన కిద్దరబ్బాయిలు: చుక్కు, గెక్కు.

వాళ్ళ అమ్మతో, అక్కడికి చాలా దూరంలో మాస్కో పట్నంలో ఉన్నారు. పగలూ, రాత్రీ ఆ నగరశిఖరాలమీద ఎఱ్ఱ ఎఱ్ఱని నక్షత్రాలు మెరుస్తూఉంటాయి.

* * *

ఉత్తరం తీసుకుని పోస్టువాడు గుమ్మం తొక్కేటప్పటికి, చుక్కూ గెక్కూ యుద్ధం చేస్తున్నారు లోపల. బలే తమాషాగా వుంటుంది వాళ్ళ దెబ్బలాట.

అసలు పోట్లాట ఎందుకు ప్రారంభమైందో అప్పుడే మరిచిపోయారు. చుక్ గెక్‌ని పప్పుపెట్టె నలిపేశా డనుకుంటూ- లేకపోతే గెక్కే చుక్ ఖాళీబూటు పాలిష్ డబ్బా తీసుకుని పారిపోయాడో.

ఇద్దరూ అప్పుడే ఒకర్నొకరు ఒకసారి గుద్దుకున్నారు. ఇంతలోకే గంట మోగింది. తెల్ల మొహాలతో ఒకర్నొకరు చూసుకున్నారు.

వాళ్ళమ్మ వచ్చిం దనుకున్నారు. ఆమెదే అందరి తల్లుల మోస్తరుదీ కాదు. వాళ్ళని కేక లెయ్యదు - తిట్టదు. దొంగలిద్దర్నీ వేరు వేరు గదుల్లో పెట్టి, పూర్తిగా ఒక గంట సేపో, రెండుగంట లో ఉంచుతుంది ఆపకోవానికి వీల్లేకుండా.



ఒక గంటలో-టిక్-టిక్-అరవై నిండు నిమిషాలుంటాయి. రెండు గంటల్లో ఇంకా అంతకంత ఎక్కువ...

గబగబా కళ్ళనీళ్ళు తుడుచుకుని తలుపుదగ్గిరికి పరిగెత్తారు. అయితే వాళ్ళమ్మ కాదు వచ్చింది- ఉత్తరం పుచ్చుకుని పోస్టుమాన్.

"నాన్న దగ్గరనుంచి! నాన్న దగ్గర్నుంచి! తొందరలో వచ్చేస్తాడు నాన్న." ఇద్దరూ గట్టిగా అరవడం మొదలెట్టారు. అరుస్తూ, గంతులేస్తూ, పిల్లిమొగ్గ లేస్తూ సంతోషం పట్టలేక, సోఫామీద దొర్లేస్తున్నారు. ప్రపంచంలోకల్లా మాస్కో ఎంత వింతనగర మైనప్పటికీ, వాళ్ళ నాన్న ఎక్కడికో వెళ్ళి సంవత్సరం దాటిపోవడంతో, మాస్కో గూడా ఎందుకూ పనికి

కాగితానికింద కనిపించివుండవచ్చు వాళ్ళకి.

ఆ ఉత్సాహంలో, ఆనందంలో వాళ్ళమ్మ రావడంగూడా కనిపెట్టలేదు వాళ్ళు. సోఫామీద బోర్లపడుకుని ఇద్దరూ అరుస్తూ, మడమలతో సోఫా విరిగిపడేటట్టు తన్నుతూండడం చూసి ఏమనుకుంటుంది తల్లి!

అసలు సంగతేమిటో తెలిసిన తర్వాత వాళ్ళ నేమీ అనలేదామె పైగా, ఇద్దర్నీ సోఫా మీంచి లేవగొట్టి, వుత్తరాన్ని ఆత్రంతో లాక్కుని చదవనారంభించింది.

ఉత్తరాలంటే — సంతోషమూ కలిగించవచ్చు — విచారమూ కలిగించవచ్చు. అందుకనే చుక్కూ, గక్కూ వాళ్ళమ్మ ఉత్తరం చదువుతుంటే, శ్రద్ధగా చూస్తున్నారామె ముఖ కవళికలు.

మొదట ఆమెముఖం ముకుళించుకుపోయింది. వాళ్ళ మొహాలు వేలవేశారు. తరవాత నవ్విందామె. అంటే ఉత్తరంలో మంచి సంగతులున్నాయన్నమాట!

"మీ నాన్నగారు రారుట" అంది ఆమె ఉత్తరం పట్టుకున్న చెయ్యి క్రిందికి జార్చుతూ "ఇంకా చాలా పనుందిట రావడానికి వీల్లేదు"

చుక్కూ, గక్కూ ఆశ్చర్యంతో ఒకరివంక ఒకరు చూసుకున్నారు ఎందుకో నవ్వుతున్న అమ్మవంక ద్వేషంతో, కోపంగా, ఏమిటేద్దామన్నట్టు చూడడం మొదలుపెట్టారు

"ఆయన రావడంలేదు యితే మనం వెళ్ళి చూడవచ్చునని అంటున్నారు" అంది ఆమె. దీంతో చుక్కూ గక్కూ సోఫా మీంచి ఒక్కసారి ఎగిరి దుమికారు.

"బలేవారే!" వాళ్ళమ్మ అన్నది మెల్లగా "ఒకసారివొచ్చి వెళ్ళండి, అనడం సులభమే — ట్రాములో కూచుని బుడింగని దిగేటట్టు!"

"అంతే అయుంటుంది. రమ్మని పిలుస్తున్నారంటే ఒక ట్రాముకారు మాట్లాడుకుని వెళ్ళాల్సుంటుంది" మధ్యలో అందుకున్నాడు చుక్.

"చిలిపివెధవ! అక్కడికెళ్ళాలంటే మొదట రైల్లో ఆరువందల పాతికమైళ్లు వెళ్ళి, ఇంకో అంత దూరం అడవుల్లోనుంచీ, గ్రామాల్లోనుంచీ బండిమీద ప్రయాణం చెయ్యాలి. ఆ అడవిలో ఏతోడేలో, ఎలుగుబంటో మింగేసేస్తుంది. అమ్మో!" అంది వాళ్లమ్మ.

అయితే చుక్కూ గక్కూ ఒక అరనిముషంగూడా ఆగలేదు ఆలోచించడానికి. ఎన్నివేల మైళ్ళైనా సరే ప్రయాణానికి సిద్ధంగా ఉన్నామన్నారు.

వాళ్ళకి దేన్ని చూసినా భయంలేదు. వాళ్లు ధైర్యవంతులు! నిన్న దొడ్లో కొచ్చిన ఊరకుక్కని రాళ్లు వేసి తరిమికొట్టలా! ఇద్దరూ గోల ఆరంభించారు. వాళ్ళమ్మ మెదలకుండా కూచుని వింటూ వుంది.

ఉన్నట్టుండి పకపకా నవ్వుతూ, ఇద్దర్నీ దగ్గరికి తీసుకుని సోఫామీద కూచోబెట్టుకుంది.

చాలా రోజుల్నుంచీ అటువంటి వుత్తరం వస్తుందని అనుకుంటూనే వున్నదనీ, తప్పకుండా వెళ్లాలనీ చెప్పింది.

వాళ్ళమ్మ ప్రయాణసన్నాహాలు పూర్తిచేసేటప్పటికి వారం పట్టింది. చుక్కూ గక్కూ కూడా కాలం వృథాపుచ్చలేదు. చుక్ ఒక పాత కత్తిని [illegible] చేసుకున్నాడు. గెక్ సాఫీఅయిన కర్రొకటి సంపాదించి, దాని కొక మేకు కొట్టి, పెద్ద శూలం తగిలించాడు దాంతో ఎలుగుబంటిగుండెల్లో పొడిచాడంటే-అది అక్కడికక్కడే కిందపడి చావాల్సిందే!

ఇక అన్ని ప్రయత్నాలూ పూర్తయినట్టే. పెట్టె[illegible]రు. తలుపుకి రెండు [illegible] సిద్ధం చేసుకున్నారు. రొట్టె, [illegible] ఇటు వంటివన్నీ తుడిచిపెట్టేశారు.

మర్నాడు రైలుకి టిక్కట్లు కొనడానికి వాళ్ళమ్మ స్టేషన్ కెళ్ళింది. ఆమె వెళ్ళినతర్వాత మళ్ళీ పోట్లాటొకటి మొదలెట్టారు. ఆ పోట్లాట చివరికెట్లా పరిణమిస్తుందో ముందే తెలిసుంటే వాళ్ళు ఆ వేళ జాగ్రత్తగానే మసలుకునేవారు.

చుక్ కాస్త జాగ్రత్తమనిషి. అతని కొక పలకల రేకుపెట్టె ఉండేది. అందులో రేకుముక్కలు, చెక్కబద్దలు, టాంకులు, విమానాలు, ఎఱ్ఱ సైనికుల బొమ్మలూ



వుండేవి. ఇంకా కొన్ని కాకి ఈకలు-బాణాలకోసం గుఱ్ఱపు వెంట్రుకలు ఏవేవో అన్నీ ఉన్నాయి.

గెక్‌కి అటువంటివేమీ లేవు. సామాన్యంగా అతనికి కుదురనేది లేదు. అయితే పాటలు చక్కగా పాడతాడు.

చుక్ వంటింట్లో కూచుని తన పెట్టిలో వస్తువులు సరిచూసుకుంటున్నప్పుడు పోస్టుబంట్రోతు వచ్చి ఒక టెలిగ్రాం ఇచ్చాడు. గెక్ ఇంకో గదిలో పాడుకుంటూ వున్నాడు.

చుక్ అది పెట్టెలో దాచిపెట్టేసి, గెక్ పాట ఆపేశాడేమో అని చూడడానికెళ్ళాడు. కుతూహలంతో తలుపు కొద్దిగా తెరిచి చూసేటప్పటికి, చుక్ వళ్ళు మండిపోయింది. గదిమధ్యలో కుర్చీ ఉంది. దానిమీద పత్రి కొకటి తూట్లు తూట్లు పడి ముక్కలు ముక్కలై ఉంది. గెక్ వాళ్ళమ్మ పచ్చ బూట్లపెట్టెని ఎలుగుబంటిగా భావించి, బలంకొద్దీ శూలంతో అదేపనిగా పొడుస్తున్నాడు. ఆ పెట్టెలోనే చుక్ రేకు బూరా, మూడురంగుల బాడ్జీలు-డబ్బులు ఉన్నాయి.

తునా తునకలైన ఆ పెట్టెని చూడగానే చుక్, గెక్ చేతిలో శూలం ఊడలాక్కుని, తొడమీద పెట్టి విరిచి ముక్కలు చేసి విసిరి నేలకేసి కొట్టాడు. గెక్కు, తల్లి పక్షినోట్లో ఆహారం గుచ్చి తీసుకునే పిల్లపక్షిలాగా, కటిక్కని చుక్కు రేకుపెట్టె అందుకుని కిటికీ దగ్గిరికి ఒక్క అంగవేసి అందులోంచి విసిరివేశాడు.

"టెలిగ్రాం! టెలిగ్రాం!" అని చుక్. గెక్ వాడివెంట పరిగె
చెవులు గింగుర్లెత్తేట్టు పెద్దకేక పెట్టి త్తాడు.
అట్లాగే వీధిలోకి పరిగెత్తాడు ఆ రేకుపెట్టె ఎంత వెదికినా కన

పడలేదు. మంచుగుట్టల్లో దేంట్లో నైనా [illegible]కూరుకుపోయిందో, రోడ్డు పడితే ఎవరైనా తీసుకురో, ఎట్లాగైతేనేం సీలుతో ఉన్న టెలిగ్రాము, ఇంకా ఇతర విలువైన వస్తువులూ అన్నీ ఎందుకూ కాకుండా పోయినాయ్.

చాలా సేపటివరకు చుక్కూ గెక్కూ ఇంట్లో మౌనంగా కూచున్నారు. ఇద్దరికీ వేడివేడివి తగలడం తప్పదుకాబట్టి, మళ్లీ కలిసారు. గెక్కుకంటె ఒక సంవత్సరం పెద్దవాడవడంచేత, తనకే ఎక్కువ తగుల్తాయని భయపడ్డాడు చుక్.

"చూడు గెక్! అసలా టెలిగ్రాంసంగతి అమ్మకి చెప్పకపోతేనేం? ఏముంది టెలిగ్రాంలో? అది లేకపోతేమాత్ర మేం?"

"అబద్ధం చెప్పగూడదు! అబద్ధం చెప్తే అమ్మకింకా కోపం వస్తుంది" నిట్టూర్చాడు గెక్.

"అబద్ధం చెప్పాల్సిన అవసరమేముంది? టెలిగ్రాం ఏదని అడిగితేచెప్దాం. అడగదనుకో—మనమే ముందుగా చెప్పడం దేనికి?" సంతోషంతో అన్నాడు చుక్.

"సరే! అబద్ధం చెప్పకుండా ఉండాలంటే నువ్వు చెప్పిన ఉపాయమే బాగుంది చుక్!" అన్నాడు గెక్.

వాళ్ళమ్మ టిక్కెట్లు తీసుకుని సంతోషంతో లోపలికి వచ్చేటప్పటికి గప్‌చిప్‌గా ఊరుకున్నారిద్దరూ. గీరుకు పోయిన మొహాలు, తడిసిన కళ్ళూ చూసి అడిగింది వాళ్లమ్మ. నిజం చెప్పం డబ్బాయి, ఈసారి దేనికోసం దెబ్బలాట?"

"పోట్లాడుకోలేదు" అన్నాడు చుక్. అబ్బే! ఏమీ లేదు. పోట్లాట మొదలెట్టబోయే సమయానికి మళ్లీ పోట్లాడగూడదనుకుని మానేశాం!" అన్నాడు గెక్.

తరవాత అంతా భోజనం చేశారు. ఇల్లంతా నిశ్శబ్దమైపోయింది. లైట్లు ఆర్పేసి నిద్రపోయినా రంతా. వాళ్ళమ్మకి ఆ టెలిగ్రాం సంగతి తెలియనూ తెలియదు, అందనూ లేదు. [సశేషం]



నాసిక్‌లోని 'గాంధీనగర్'నందు కాంగ్రెసు వాలంటీర్ దళంవారి పతాకవందనం.

# బంగారుపక్షి

శ్రీ వింజికోట వెంకటరామన సుబ్రహ్మణ్యశాస్త్రి

ఒ గారికి చాల అందమైన తోట వుంది. ఆ తోటలో బంగారు పళ్ళు కాసే చెట్టు ఒకటి వుంది. ఆ పళ్ళు పండబోయే సమయానికి రోజు కొక్క పండు చొప్పున తగ్గుతున్నట్లు రాజుగారు కనిపెట్టి, తోటమాలిని పిలిపించారు. రాత్రంతా చెట్టుక్రింద కాపలా వుండి పళ్ళు ఎలా పోతున్నాయో కనిపెట్టమని ఆజ్ఞ ఇచ్చాడు. తోటమాలి తన పెద్ద కొడుకును పళ్ళు ఎలా పోతున్నాయో కనిపెట్టడానికని ఆ రాత్రి పంపాడు. సరిగ్గా 12 గంటలయ్యేసరికి అతనికి నిద్ర వచ్చింది. ఆ వేళ కూడా ఒక పండు తక్కువ అయింది. ఆ మర్నాడు రెండో కొడుకుని కాపుంచాడు తోటమాలి. వాడు కూడా రాత్రి 12 గంటలయ్యేసరికి నిద్రపోయాడు. ఆ రోజు కూడా ఒక పండు తక్కువ అయింది. మూడవనాడు తోటమాలి తన మూడో కొడుకు గోపన్నను పంపాడు. రాత్రి 12 గంటలయేసరికి గోపన్నకొక బంగారుపక్షి కనిపించింది. అది రివ్వుమని ఎగురుకుంటూ వచ్చి తన ముక్కుతో ఒక పండును తుంచి పట్టుకుని ఎగిరిపోబోయింది. గోపన్న బాణంతో పక్షిని కొట్టాడు. పక్షికి దెబ్బ తగలేదు. కాని పక్షి రెక్క ఒకటి క్రింద పడింది. ఆ రెక్క రాజుగారిదగ్గరకి తీసుకెళ్ళి, జరిగినదంతా చెప్పాడు గోపన్న. "ఎలా



గైనా సరే ఈ రెక్క కల్గిన పక్షి నాకు కావాలి" అని రాజు అన్నాడు.

తోటమాలి పెద్దకొడుకు ఆ పక్షిని పట్టుకోవాలని బయలుదేరాడు. కొంతదూరం నడిచేసరికి ఒక అడవిలో ఒక నక్క కనిపించింది. అతడు దానిని బాణంతో కొట్టి చంపబోయాడు. "నన్ను చంపకు, నీ కో వుపాయం చెప్తాను. నీపని ఏమిటో నాకు తెలుసు. నువ్వు బంగారుపక్షికోసం వెడుతు[న్నావు]" అని ఇంకా ఇలా చెప్పింది "సాయంత్రం అయ్యేసరికి నువ్వు ఒక పల్లె చేరుకుంటావు. అక్కడ రెండు సత్రవులు ఒకదానికెదురుగా వుంటాయి. చూడ్డానికి ఒకటి అందంగాను, రెండవది అనహ్యంగాను వుంటాయి. నువ్వు రెండో సత్రములో ఈ రాత్రంతా మకాం చెయ్యి."

అతనికి నక్క చెప్పింది నచ్చలేదు. దానిని ...

లని ప్రయత్నించాడు. కాని ఆ నక్క చిక్కకుండా పారిపోయింది నక్క చెప్పినట్టే అతనికి రెండు సత్రవులు కనపడ్డాయి. అనహ్యంగా వున్న సత్రవులోకి వెళ్ళడం అమర్యాద అనుకొని, అందంగా వున్న సత్రవులోకి వెళ్ళాడు అక్కడ నృత్యాలు వినోదాలు చూసేసరికి అతడు తన పని మరచిపోయాడు.

కొడుకు రాకపోవడం చూసి ముసలి రెండో కొడుకు బయలు అతనికి కూడా ఆ నక్క కనబడింది. నక్క అదే సలహా ఇచ్చింది. కాని అతడు అలాగే అందమైన సత్రవులోకి వెళ్లి, తన పని మరిచిపోయి, అక్కడే వుండి పోయాడు.

ఇద్దరూ రాకపోవడం చూసి మూడో కొడుకు గోపన్న బయలు దేరాడు. గోపన్నకీ ఆ నక్క కన పడింది. అతని అన్నల కిచ్చిన సలహానే నక్క వానికీ ఇచ్చింది. గోపన్న అన్నల్లాగ నక్కను చంపడానికి ప్రయత్నించలేదు. అందు చేత నక్క అతనికి దారి చూపుతూ ముందుకి వేగం తీసుకువెళ్లింది గోపన్న, తిన్నగా రెండో సత్రవులోకే వెళ్ళేడు. తెల్లవారగానే గోపన్న బయలుదేరేసమయానికి నక్క వచ్చి "తిన్నగా వెళ్ళు ఒక కోట కనిపిస్తుంది. అక్కడ సేవకులందరూ పడుకుంటారు. లోపలి కెళ్ళగానే కర్రపంజరంలో నీకు కావలసిన బంగారుపక్షి కనపడుతుంది. కాని దానిపక్కనే బంగారుపంజరం కూడా వుంటుంది. బంగారుపక్షిని దానిలో ఉంచి తీసుకురావద్దు" అని సలహా ఇచ్చింది గోపన్న నక్క సహాయంతో ఆ కోట ప్రవేశించాడు. కర్రపంజరంలో వున్న బంగారుపక్షిని చూశాడు అది యెంతో అందంగా వుంది. అది పక్క నున్న బంగారుపంజరంలో వుంటే ఎంతో బాగుంటుం దనుకున్నాడు మెల్లిగా పక్షిని తీసి బంగారు పంజరంలో పెట్టబోయాడు దాంతో పక్షి గట్టిగా అరిచింది సేవకులు లేచి గోపన్నను పట్టుకున్నారు రాజుదగ్గరకి తీసుకెళ్ళారు.

"ఒక బంగారుగుర్రాన్ని తెచ్చి యిస్తే పక్షిని ఇస్తాను" అని గోపన్నతో రాజు చెప్పాడు.

గోపన్న ఆ గుర్రాన్ని వెతకడానికి విచారంతో బయలుదేరాడు. మళ్లీ నక్క గోపన్నదగ్గరికి వచ్చింది. "తిన్నగా వెళ్లు, ఇంకోకోట వస్తుంది. అందులో గుర్రాలసాల కనిపిస్తుంది. అక్కడొక బంగారు గుర్రం వుంటుంది. ఆపక్కనే బంగారుజీను కూడా వుంటుంది కాని ఆగుర్రంపై నున్న తోలుజీను మార్చవద్దు.

బంగారు జీను తగిలించకు. గుర్రాన్ని జాగ్రత్తగా తీసుకురా" అని చెప్పింది. మళ్ళీ నక్కసహాయంతో గోపన్న కోట చేరుకున్నాడు శాలలో గుర్రాన్ని చూశాడు తోలుజీను బంగారు గుర్రానికి బాగుండదనుకుని బంగారుజీను తీసి తగిలించబోయాడు బంగారు జీనుమీద అతని చెయ్యిపడగానే సేవకుడు లేచి గట్టిగా అరిచాడు సేవకులంతా వచ్చి గోపన్నని పట్టుకొని రాజుదగ్గరికి తీసుకెళ్లారు "ఒక అందమైన రాజకుమార్తెని తెచ్చి యిస్తే బంగారుగుర్రాన్ని యిస్తాను" అన్నాడు రాజు.

మళ్ళీ గోపన్న విచారంతో బయలుదేరాడు. నక్క కనిపించి "తిన్నగా వెళ్లు. మరో కోట కనపడుతుంది. రాత్రి 12 గంటలవేళ ఒక రాజకుమార్తె ఉద్యానవనంలోకి వస్తుంది. నువ్వు ఆవేళప్పుడు జాగ్రత్తగా ఆమెను సమీపించు. ఆమెను నీ రాజ్యానికి తీసుకుపోతానని చెప్పు. ఆమె తన తల్లిదండ్రుల్ని అడిగివస్తానంటుంది. కాని ఆమెను తల్లిదండ్రులవద్దకు వెళ్లనివ్వకు. నీతో తీసుకురా" అని చెప్పింది. మళ్ళీ నక్కసహాయంతోనే గోపన్న మూడవకోటలోకి వెళ్లాడు. రాత్రి 12 గంటలవడంతోనే రాజకుమార్తె ఉద్యానవనంలో కనిపించింది. ఆమెను సమీపించాడు. ప్రేమతో పలకరించింది. గోపన్న ఆమెను తనతో రమ్మని కోరాడు. ఆమె తన తండ్రితో చెప్పిరావడానికి అనుమతి కోరింది. గోపన్న కాదనలేకపోయాడు. సరే నన్నాడు. ఆమె వెళ్లి తండ్రితో చెప్పగానే ఆ రాజు గోపన్నని ఖైదుచేశాడు "ఎనిమిది రోజులలో ఆ కిటికీకి ఎదురుగా కనపడుతున్న కొండని త్రవ్వగలిగినట్లయితే నా కుమార్తెను నీ కిస్తాను" అన్నాడు రాజు గోపన్న వెళ్ళి కొండ త్రవ్వ నారంభించాడు ఏడో రోజు సాయంత్రం నక్క వచ్చింది. 'నువ్వు రాత్రి పడుకో నేను ఆపని చేసేస్తాను" అంది నక్క ఆ రాత్రి తన మాయబలంవల్ల ఆ కొండను మాయంచేసింది మర్నాడు అది చూసి రాజు సంతోషించాడు కుమార్తెను గోపన్న కప్పగించాడు

"ఒక్క బంగారు పక్షే కాకుండా, బంగారుగుర్రాన్ని, రాజకుమార్తెను కూడా తీసుకోవాలి. నే నో సలహా చెప్తా విను" అంది నక్క. "రాజకుమారిని రెండో రాజువద్దకు తీసుకువెళ్లు. ఆమెను చూసి రాజు నీకు గుర్రాన్ని యిస్తాడు. గుర్రం చాలా జోరుగా పరిగెత్తగలదు. ఆ గుర్రాన్ని నువ్వెక్కి, బయలుదేరేముందు అమాంతంగా రాజకుమార్తెను ఒడిసిపట్టి గుర్రంమీద ఎక్కించు. వెంటనే బయలుదేరుతుంది గుర్రం."

నక్క చెప్పినప్రకారం గోపన్న రాజకుమార్తెతోసహా బంగారు గుర్రమెక్కి వచ్చాడు. తరువాత నక్క రాజకుమార్తె నొకచోట దాచింది. గోపన్నను మొదటి రాజువద్దకు పంపుతూ, "ఈ గుర్రాన్ని చూసి నీకు బంగారుపక్షిని యిస్తాడు

(36-వ పేజీ చూడుడు)



బెల్జియం భావి రాజైన బడోయిన్ రాకుమారుడు, ప్రక్క తమ్ముడు ఆల్బర్టు రాకుమారుడు.

కరుణారసహృదయుడూ రాజనీతిజ్ఞుడూ మరొకడున్నాడా? ఎందుకు చెబుతున్నానంటే, ఈనాడు అక్షరజ్ఞానం మనకి నిత్యజీవితంలో అవసరం. వెనక అలా కాదు కుమ్మరిపనీ, వడ్రంగిపనీ ఎలాటిదో రాయడంకూడా అలాటి వ్యాపకమే వెనకటి రోజుల్లో

రాజు కొత్తదేశం జయించగానే అక్కడ ఒక స్తూపం పాతించి, తన విజయాల్ని రాతిమీద చెక్కించేవాడు ఈనాడు చందాలపట్టీలో పేరువేసినట్టే ఒక లక్షాధికారి నుయ్యి తవ్వించో, సత్రం కట్టించో ధర్మకర్తపేరు చెక్కించుకునేవాడు. మరో భూనాథుడు నాలుగురోడ్లూ కలిసేచోట మంటపం కట్టించి, ఆ మంటపం గోడలమీద తన ప్రజలు నడుచుకోవల్సిన మార్గాలు లిఖింపజేసేవాడు. పురాతనకాలంలో లిపి ఎంతకీ రాచకార్యనిర్వహణకే ఎక్కువగా సాయపడేది.

'సరస్వతీ నమస్తుభ్యం—వరదే కామరూపిణీ' అంటూ పిల్లల్ని బళ్ళో వేస్తాం. పుస్తకం కాలికి తగిలితే కళ్ళ కద్దుకుంటాం. మనకి విద్య పూజలాటిది. ఇప్పుడు చెబుతున్నారో లేదోగాని వెనక 'ఓం' అనే అక్షరం రాయించేవాడు టీచరు మొట్టమొదట బలపం పట్టుకోగానే ఆర్యుల్లో ఒక తెగవారు 'ఓం' కారంతో ప్రపంచమారంభమయిందని నమ్మేవారు కనక 'అ ఆ' లకంటె 'ఓనమాలు' ముందు నేర్పించేవారు. లిపి లేకపోతే వాక్సాహిత్యం చాలా భాగం తుడిచిపెట్టుకుపోయివుండేది లిపి వల్లనే కదా మనిషి జంతువులకంటె గొప్పవాడయాడు! ఈ లిపి దేశకాల పరిస్థితుల్ని బట్టి మారిపోయేది మాటాడేదే రాయడంలో మొట్టమొదట ఫొనీషియనులు దారితీశారు ఇప్పుడు ప్రపంచభాషల్లో చాలామట్టుకు ఆపద్ధతినే అనుసరిస్తున్నాయి

కాక్స్టన్ అచ్చుయంత్రం విద్యావ్యాప్తిలో విప్లవం తీసుకువచ్చింది మడికట్టుకు కూచుని రాయవల్సిన పుస్తకాల్ని అచ్చుయంత్రం టపాటపా ముద్రించి లోకానికి అమ్మేది విద్య ఏ కొద్దిమంది అదృష్టవంతులకో కాక, జనబాహుళ్యమంతకీ కావాలనే ప్రచారం ప్రయత్నం బయలుదేరాయి.

లిపి వున్నవి సజీవభాషలనీ, లిపి లేనివి జీర్ణభాషలనీ ఒకసారి చెప్పాను ఈ సజీవభాషల్లో కొన్ని కాలంగడచినకొద్దీ నిర్జీవం కాక తప్పదు ప్రస్తుత ప్రపంచంలో ఉన్న భావసంపదని ఇముడ్చుకోగల స్థితిలో లేవు అన్ని సజీవభాషలూ ఎంతైనా, భావాన్ని రాతమూలకంగా చెప్పేది లిపి అనీ, శబ్దరూపంలో చెప్పేది వాక్కు అనీ మనం మరవకూడదు ఉత్తమభావాలు జీర్ణించుకోలేని భాషకి భవిష్యత్ ఏముంటుంది?

భాష భావానికి బంటులాటిది అయినా, భాష ఔన్నత్యాన్ని బట్టి భావస్వరూపం చిత్రితమవుతుంది ఇంగ్లీషుమాటాడే ప్రజల్లో ధ్వాన్ని బట్టీ అక్షరుచుల్ని బట్టీ భేదాభిప్రాయాలుంటాయి, కాని, భావనాసౌధం ఒకేమాదిరి కట్టడం

లిపివల్ల మానవుడు ప్రతిభావంతుడయాడు వివిధభాషల్లో అందాలూ ముత్యాలహారంలా గుచ్చుకు మెళ్ళో వేసుకునే అవకాశం కలిగింది. ఆ ముత్యాలహారం చూసుకు మురిసిపోతూ సాహిత్యోపాసకుడయాడు మనిషి

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)

[ఇంకా వుంది]

# ధాన్యసేకరణ



**శ్రీ వేలూరి సహజానందం**

తూరుగు ప్రాంతాలకు ధాన్యం త్వరలో అందివ్వాలనే సంకల్పంతో ప్రభుత్వం ధాన్యసేకరణకు తీవ్రంగా పూనుకుంది. పల్లె ప్రాంతాల్లో కమ్యూనిస్టు పోలీసు ఘర్షణలకు అలజడి పుట్టినట్లే, 'ఈ ప్రొక్యూర్ మెంటు' మూలంగా కూడా అలజడి బయలు దేరింది. ఆఫీసర్లతో పాటు పోలీసులు, తుపాకులూ కూడా హాజరు కావటంతో, దౌర్జన్య వాతావరణం అలవాటు అయిపోతున్న గ్రామ ప్రజలకు భయం మరింత హెచ్చుతోంది. చెవికెటునుంచి కారు 'బీపు' చప్పుడు వినబడ్డా, ఎక్కడి వాళ్ళక్కడ కాళ్లు విరగ గొట్టకోటం, ఇళ్లకు పగుగత్తి, ఉన్న ధాన్యాన్ని, బియ్యాన్ని ఎక్కడో అటకలమీద, పాతర్లలో, పెంటకుప్పలకింద, గర్భదరిద్రులూ, అస్పృశ్యులూ అయిన మాల, మాదిగల ఇళ్లల్లో దాచేయటం జరుగుతోంది. ఇలా ఏఒకడో, ఇద్దరో కాదు. ఊళ్లో వాళ్లంతా. ప్రభుత్వ శాసనాలకు, కార్యక్రమాలకు ఏ కొద్దిమందో వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ, ప్రభుత్వ దృష్టికి చాటుగా శాసనవిరుద్ధమైన పనులు చేయటం తప్పదు. అలాంటి కొద్ది సంఘటనలవల్ల ప్రభుత్వానికి వచ్చే పెద్ద అపకారం లేదు. కాని అధిక సంఖ్యాకులు ఎవరైతే ప్రభుత్వాన్ని ఓట్లిచ్చి నిలబెట్టారో, వారే తమ ప్రభుత్వ కార్యకలాపాలతో తోడ్పడకుండా, బహిరంగంగా కాకపోయినా, చాటుమాటుగా ప్రభుత్వ సంకల్పాన్ని భగ్నం చేయటానికి పూనుకుంటున్నారంటే, అందును గురించి ప్రభుత్వం ఆలోచించాలి.

గ్రామంలో పెద్ద భూస్వాములు, (రహస్య) వడ్డీవ్యాపారులు, స్వార్థంకోసం ప్రభుత్వంతో 'అసహాయోద్యమం' జరపటం వింతకాదు. కాని చిన్న రైతులు, కౌలు రైతులు బీదబిక్కి, సెంటులేక, రు 250, బస్తాకిచ్చి కొనుక్కుంటున్న ప్రజలు అంతా కూడా ధాన్య సేకరణ ఆఫీసర్లనుచూసి జడిసి పోతున్నారు.

కమ్యూనిస్టులను సర్వనాశనం చెయ్యాలిఅని ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసే పెద్దభూఖామందులు, ఆసాములు, ఇప్పుడు ప్రభుత్వానికి తోడ్పడకుండా, ధాన్యాన్ని దాస్తున్నారు. ప్రభుత్వంమీద కమ్యూనిస్టుల కెంతభయ, భక్తి, శ్రద్ధలున్నాయో, ఈ భూస్వాములకూ అంతే. తమ స్వంతఆస్తిపాస్తుల విషయంలో మటుకు ప్రభుత్వం తమను ఉద్ధరించాలి. కాని ప్రభుత్వాన్ని ఇతర విషయాల్లో తాము ఆశకోరు. వీరికి ప్రజాస్వామ్యము, అహింస, ఆలోచనా స్వాతంత్ర్యము... ఇదేమీ అవసరం లేదు. తమ ఆస్తిపాస్తులకు లోటు లేకుండా ఉంచేచాలు. పరిపాలించేది విదేశీయులైనా ఒకటే. స్వరాజ్యమైనా ఒక్కటే. సాధ్యమైనంతవరకు ఎలాగైనాసరే ఇంకా డబ్బు, పొలం, పుట్ర, పోగుచేసుకోవటం; ఇదే వారి ఆశర్యం. స్వరాజ్యమూ కాదు, ప్రజాస్వామ్యమూ కాదు.

ఈ కమ్యూనిస్టు అరాజకంలో ప్రభుత్వంపోలీసు చర్యలతోపాటు, పెద్దభూస్వాములను కొన్ని తక్షణ, అవసర సంస్కరణలకు ఒప్పించవలసింది. కాని ప్రభుత్వం పెద్ద భూస్వాముల్లో అలాంటి మార్పేమీ తీసుకురాలేక పోయింది. అసలటువంటి నిర్మాణాత్మక విధానానికి ప్రభుత్వం పూనుకోనలేదు. అందువల్లనే ఇప్పుడుకూడా ఈ పెద్ద ఆసాములు- కొద్దిమంది మినహా- బీదబిక్కికి వడ్లు బస్తా రు 25కు. నిర్దాక్షిణ్యంగా, నిరాటంకంగా అమ్ముతున్నారు' అమ్మగలుగుతున్నారు. దారిద్ర్యం కమ్యూనిజానికి తెరచాప అని ఓపక్కన అంటూ, మరొకపక్కన దరిద్రుల దారిద్ర్యాన్ని వృద్ధిచేయటం జరుగుతోంది.

ఇంకచిన్న రైతులు, కౌలుచేసుకు నేవాళ్లు, సెంటులేనివాళ్లుకూడా ప్రభుత్వానికి ఎందుకు విముఖంగా ఉంటున్నారు?

ధాన్యసేకరణకని వచ్చిన ఆఫీసర్లు మామూలుగా తమ అధికార దర్పాలను ఎక్కువగా తక్కువ వారిపై చూపిస్తారు. గ్రామాల్లో పుకారు, ఇంటింటా జొరబడి, ఉన్న వడ్లు, బియ్యంకూడా తీసుకుపోతారని. దీనితో తక్కువస్థితిపరుల పని మరీ కష్టం అయింది. ఉన్న పరుకు ఎక్కువకాకపోయినా, అది కాస్తా సర్కారు తీసుకువెళ్లితే, గంజికూడా దొరకదనే భయం.

ఒకచిన్న రైతు ఉన్నపొలంలో అవసరం కొద్దీ ధాన్యంఅంతా- సర్కారు కివ్వవలసిన దానికి మించి- అమ్మేసి, తర్వాత బ్లాకు-మార్కెట్టు రేటుకు రు 20- రు 25 మధ్య వడ్లుకొనుక్కొని, తిండికి ఉంచుకున్నాడు. తన కొస్తపురిపై ఎప్పుడు ఆఫీసర్లు వచ్చిపడతారో అని భయం. తాను సర్కారుకిచ్చింది- గవర్నమెంటు రేటుకు. తాను కొన్నది. 'బ్లాకు' రేటుకు. ఈ మొరవినేవాడెవడు?, పైపెచ్చు రు20, రు. 25 పెట్టి కొన్నవడ్లు కాసినీ మళ్ళీ ప్రభుత్వం తీసుకుంటే, ధననష్టమూ, ధాన్యనష్టమూ. చిన్న రైతు స్థితి ఇలాఉంది.

ప్రభుత్వపు ధాన్యసేకరణ విధానం పూర్వపు పద్ధతిలోనే సాగుతోంది. ఈ విధానంమారాలి. ఆఫీసర్లు రాగానే పెద్ద ఆసాములు ఇస్తే ఏ కొద్దిధాన్యమో ఇవ్వటం లేదా ఏమీలేదని చెప్పటం. అఫీసర్లు 'ఊ' అనటం, చిన్న రైతులమీద ఆఫీసర్లు జులుం చూపించటం, ఈరివాజుపోవాలి.

రాష్ట్రంలో కొన్నిప్రాంతాల్లో క్షామం రావచ్చు అనుకొనే ఈ నాటికి ఇప్పుడు, ఇదివరకే లెక్కలప్రకారం భూస్వాములు ఇవ్వవలసిన ధాన్యంఇంకా ఆఫీసర్లు పోగుచేస్తున్నారంటే, భూస్వాముల సహాకారం గురించి, ఆఫీసర్ల చురుకుతనం గురించి వేరే చెప్పనక్కర్లేదు. ఈ మధ్య ఆఫీసర్లు ఒక పెద్దరైతు ఇంటికివెళ్లారట. ఆఇంట్లో ఒక్క వడ్లబస్తాకూడా కనిపించలేదట. అయినప్పటికీ ఆ ధాన్యంఏమైంది? ఎవరికిచ్చారు? ఎవరికమ్మారు? ఎంతకమ్మారు? అని ఆఫీసర్లు ప్రశ్నించలేదు. కొన్ని గ్రామాల్లో పెద్ద

ఆసాములు హరిజనుల ఇళ్లల్లో తమ ధాన్యాన్ని దాస్తున్నారు- వాళ్ల ఇళ్లకు ఆఫీసర్లు రారుగదా అని.

ఎవరి దగ్గరైతే ధాన్యం ఎక్కువగా ఉంటుందో వారే ధాన్యాన్ని దాచి వేస్తుంటే, ధాన్యసేకరణ ఎలా జరుగుతుంది? 20, 25 ఎకరాలు, ఇంకా ఎక్కువ ఉన్న ఆసాములను చూపులో ఉంచుకొని, ఆఫీసర్లు తీవ్రంగా పనిచేస్తే ధాన్యసేకరణ తొందరగా నెరవేరుతుంది. 30 ఎకరాలకు పైన ఉన్న ఆసాములవద్దనుంచి పెద్ద ఉద్యోగులు మటుకే ధాన్యాన్ని సేకరించాలంటే, లాభమేమిటి? ఈ ఉద్యోగి ఒక్కడూ ఎన్ని గ్రామాలను చూడగలడు? ఎన్నిసార్లు ఒకే గ్రామానికి తిరగగలడు? అతను పురమాయించే కింది ఉద్యోగులు ఎంతవరకు ఆ భారం నిర్వహించి, పనిచేస్తారు?

ఎప్పుడో పంటలరోజుల్లోనే సేకరించవలసిన ధాన్యాన్ని ఇంకా ఇప్పుడు సేకరిస్తూ ఉన్న ఉద్యోగులు, ఇంకా అదనంగా ఆ ఆసాములవద్ద నుంచి ఎక్కువ ధాన్యాన్ని సేకరించగలుగుతారా అనేదే ప్రశ్న.

గ్రామాల్లో ధాన్యాన్ని తీవ్రంగా సేకరించటం విషయంలో, ప్రభుత్వం ఒక ఏర్పాటు చేయాలి. గ్రామాల్లో తిండికి తగినంతైనా లేని, అసలే లేని ప్రజలకు 'రేషను' ఏర్పాటు చేయుటం అత్యవసరం. బస్తీల్లో, నగరాల్లో ప్రజలకు సర్కారు రేటున బియ్యం (దొరికే కాసినైనా) దొరుకుతయ్. కాని గ్రామాల్లో ప్రజలు ఇప్పుడు బస్తారు 25కు కొంటున్నారు. ఈ విషయం ఉద్యోగులకు గాని, ప్రభుత్వానికి గాని పట్టినట్టు లేదు. గ్రామాల్లోంచి ధాన్యాన్ని తీసుకు వెళ్లేప్పుడు' ఆ గ్రామంలోని ప్రజలందరికీ సరిపడ ధాన్యాన్ని నిల్వచేసి, రేషను ఏర్పాటు చేసి తీసుకువెళ్లాలి. ఇలా ఇప్పుడు జరగటం లేదు. ఇందు మూలంగా కూడా ప్రజలు ఎక్కువగా సర్కారుతో సహకరించ లేకుండా ఉన్నారు. ఈ ఏర్పాటు చేయకపోతే, గ్రామాల్లో భూమి లేనివారు బస్తారు 25 కి కంటె కూడా ఎక్కువ పెట్టికొనవలసి వస్తుంది. బస్తీల్లో ప్రజల ఆందోళన ప్రభుత్వాన్ని ఇట్టె కదిలిస్తుంది. కాని పల్లె ప్రజల ఆందోళన అరణ్యరోదనం. అందులో ఈ దౌర్జన్య వాతావరణంలో ఎవడైనా గట్టిగా మాట్లాడితే వాడు కమ్యూనిస్టు.

ఉద్యోగులతో మాట్లాడటమంటేనే ప్రజలకు ఇంకా భయంగా ఉంది. వెనకటికి కిందటి తుపాను అయ్యాక ప్రభుత్వం పంపిన ధనసహాయం చాలదని, సరిగా పంచదని ఒకచోట ప్రజలంటె, తత్ఫలితంగా తర్వాత వారందరికీ దేహశుద్ధి అయింది. కాబట్టి ప్రజల సహనశక్తి క్షీణించక మునుపు, వారిని పైచెప్పిన విధంగా ఉద్యోగుల దౌర్జన్యానికి గురిచేయకుండా ప్రభుత్వం గ్రామాల్లో ధాన్యంలేని వారందరికి 'రేషను' ఏర్పాటు చేయాలి.

గ్రామాల్లో భూమిలేని వారు ఎక్కువమంది. ఓటర్లలో అధిక సంఖ్యాకులు వీరు. వీరికి సహాయంగా ప్రభుత్వం ప్రవర్తించకపోతే, ఎప్పటికైనా ప్రభుత్వమే దెబ్బతింటుంది' ప్రభుత్వము ప్రజల్లో భయం కలిగించేందుకు బదులు, శ్రద్ధాగౌరవాలను కలిగించుకోవాలి. ప్రజల్లో నిర్లిప్తత బదులు, చైతన్యం కలిగించుకోవాలి.

కమ్యూనిస్టు దాడలను ఎదుర్కొనేందుకు గాను, కమ్యూనిస్టుల ఆచూకీ తెల్పగలందులకు గాను పల్లెపల్లెల్లో ప్రజలను రక్షకదళాలుగా ఏర్పడమన్నట్టే, గ్రామాల్లో ధాన్యమున్న పెద్ద భూస్వాముల ఆచూకీ ఉద్యోగులకు తెలిపే ధాన్యసేకరణ దళాలుగా కూడా ఏర్పడమని, ఊతం ఇస్తే, పల్లెల్లో ధాన్యం తీవ్రంగా సేకరించవచ్చు.

———



10 వ తేదీనాడు అమలాపురంలో కురిసిన విపరీత వర్షాలవల్ల వీధులన్నీ ఇలాగ జలప్రవాహమయమయిపోయినవి.

## బంగారుపక్షి
(31-వ పేజీ తరువాయి)

దిగకుండా కూచునే, అది నిజమైన బంగారుపక్షి అవునో కాదో చూస్తానని చెప్పి పుచ్చుకో. వెంటనే గుర్రాన్ని వొదులు. ఇక్కడికి చేరుకుంటావు" అని చెప్పింది నక్క. ఆ ప్రకారమే గోపన్న పక్షిని, తీసుకుని గుర్రంపైన వచ్చేశాడు. ఆ రాజు. నువ్వు గుర్రం మీద నక్కతో కలిసి అడవిలోకి వెళ్లిన తరువాత, నక్క గోపన్నను చూసి "అదిగో అక్కడొక చెరువుంది. కాని నువ్వు ఆ చెరువుగట్టున ఎప్పుడూ కూర్చోకు" అని చెప్పి, నక్క వెళ్లిపోయింది.

సత్రవులు రెండూ వున్న పల్లె చేరుకొని గోపన్న తన అన్నల్ని ఉరి తీస్తారని తెలుసుకున్నాడు. ధనమిచ్చి వారిని విడిపించాడు. అన్నదమ్ములు ముగ్గురూ రాజకుమార్తెతోనూ, గుర్రంతోనూ, పక్షితోనూ ఆ చెరువువద్దకు వచ్చి ఒడ్డున విశ్రాంతికి కూర్చున్నారు.

గోపన్నకి నిద్ర పట్టగానే అన్నలిద్దరూ గోపన్నను చెర్లోకి తోసేసి రాజకుమార్తెను, గుర్రాన్ని పక్షిని వెంటపెట్టుకుని తమ రాజు వద్దకు వెళ్ళారు. కాని అక్కడ బంగారుపక్షి పాడలేదు. రాజకుమార్తె దుఃఖిస్తూకూర్చుంది. గుర్రం గడ్డితినడం మానివేసింది.

గోపన్న మెల్లిగా ఒడ్డు చేరి రాజకుమార్తెకోసం వెతకనారంభించాడు. ఇంతలోనే నక్క వచ్చి గోపన్నను చీవాట్లు పెట్టి, "నువ్వు గాని రాజ్యంలోకి ఈ రూపంలో వెళ్లావంటే నీ అన్నలు చంపేస్తారు" అని హెచ్చరించి వెళ్ళిపోయింది. గోపన్న మారువేషంతో తన ఊరు చేరాడు. అత డూరుచేరగానే పక్షి పాడడం మొదలెట్టింది. గుర్రం సంతోషంతో సకిలించింది. మారువేషంతో గోపన్న రాజుదగ్గరకు వెళ్ళి జరిగినదంతా చెప్పాడు. రాజు అతని అన్నలిద్దరినీ శిక్షించి, తన తరువాత రాజ్యాధికారాన్ని గోపన్నకివ్వదలిచినట్లు ప్రకటించాడు.

కొన్నిరోజులకు గోపన్నకు నక్క కనిపించింది. తనను బాణంతో కొట్టి చంపవలసిందిగా గోపన్నను కోరింది. మొదట నిరాకరించినా ఇందులో ఏదో విశేషం ఉందని అనుమానపడ్డాడు. చివరికి అంగీకరించి నక్కను బాణంతో కొట్టాడు. వెంటనే నక్క ఒక రాజకుమారుని రూపం ధరించింది. గోపన్న రాకుమారుని సమీపించి "నీ వెవరు?" అని ప్రశ్నించాడు. రాజకుమారుడు తన కథ నంతా గోపన్నకు ఎరిగించాడు. అతడు ఆ రాజకుమార్తెకు అన్న. రోజూ మిత్రులతో కలిసి ఆడుకునేవాడు.

ఒకనాడు తన ఊరికి కొంత దూరంలో కల ఒక మైదానానికి మిత్రులతో కలిసి వెళ్లాడు. అక్కడ అందరూ కలిసి ఆడుకుంటున్న సమయంలో ఒక పాము వచ్చింది. ఆపాముని పిల్లలంతా కలిసి రాళ్ళతో కొట్టి చంపారు. ఆ పామును ఒక మునీశ్వరుడు పెంచేవాడు. మునీశ్వరుడు కోపంతో వచ్చి "చంపిన దెవరు?" అని గద్దించి ఆ [illegible]డు. అందరూ భయపడి [illegible] రాజకుమారునిపైన పెట్టారు. మునీశ్వరుడు అతనిని శపించి నక్కగా మార్చాడు. రాజకుమారుడు ప్రాధేయపడగా శాపవిముక్తికి ఉపాయం చూపాడు. ఆ ప్రకారం గోపన్నవల్ల రాజకుమారుడు శాపవిముక్తుడైనాడు.

---



సెప్టెంబరు 3 వ తేదీని కాశ్మీర్ మెయిల్‌కు సంభవించిన ప్రమాదంలో కూలిపోయిన ఇంజన్, రైలు పెట్టెలు.

నేటిప్రపంచం:

# కొరియాలో అమెరికన్ సేనల కొత్త దండయాత్ర



ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశం వారంరోజులలో ప్రారంభమౌతుందనగా, అమెరికన్ విదేశాంగమంత్రి జాన్సన్ రాజీనామానిచ్చిన మూడు రోజులకు, 15 వ తేదీ శుక్రవారం నాడు అమెరికన్ సేనలు కొరియాలో పశ్చిమ తీరాన కొత్తదండయాత్ర ప్రారంభించాయి.

ఇంతవరకూ దాదాపు నలభై వేల టన్నుల బాంబులు కురిపించి కొరియన్ కమ్యూనిస్టులకు, ప్రజానీకానికి విపరీత నష్టం కలిగించాయి అమెరికన్ విమానాలు. విమానదండయాత్రల మూలంగా రెండున్నర మాసాలలో కొరియా ప్రజానీకానికి సంభవించినంత నష్టం రెండో ప్రపంచయుద్ధంలో లండన్ నగరానికి కూడా సంభవించలేదు. జర్మనీపై ఒక్కొక్కసారి వెయ్యి అమెరికన్ విమానాలు దాడిచేసినా కొరియాలో సంభవించినంత ప్రాణనష్టంసంభవించలేదు.

ఇంత విధ్వంసం జరిపి అమెరికన్ సేనలు ఇంచోన్ ఓడరేవులో దిగాయి. ఇంచోన్ రేవులో దిగిన సేనల్లో అత్యధికభాగం అమెరికన్ నౌకాకల్లో వచ్చిన అమెరికన్ సేనలు. వీరితో దక్షిణ కొరియన్ సేనలు, బ్రిటిష్, కెనేడియన్, ఆస్ట్రేలియన్, న్యూజీలాండ్ సైనిక నిపుణులుకూడా ఉన్నారు. దక్షిణాన యుద్ధరంగానికి ఇంచోన్ రేవు 120 మైళ్ళు పశ్చిమోత్తరదిశలో ఉంది. పూర్వ దక్షిణ కొరియన్ రిపబ్లిక్ రాజధాని సోల్ నగరానికి పదిమైళ్ళు పశ్చిమాన ఉంది.

సోల్ నగరానికి పశ్చిమోత్తరదిశగా పది మైళ్ళలో కల కింపో విమానాశ్రయాన్నీ, నగరాన్నీ అమెరికన్ పెరాట్రూపర్లు ఆక్రమించుకున్నారు. దక్షిణకొరియన్ దళం ఒకటి ఇంచోన్‌కు దక్షిణంగా 80 మైళ్ళలోకల కున్సాన్ రేవులో దిగింది.

అమెరికన్ సేనలు దిగేముందు ఇంచోన్ రేవు పైన అగ్నివర్షం కురిపించాయి. కమ్యూనిస్టుల ఫిరంగులుకూడా అమెరికన్ నౌకాదళంపైన కాల్పులు జరిపాయి. రెండు అమెరికన్ నౌకలకు స్వల్పంగా దెబ్బతగిలినప్పటికీ, త్వరలోనే అమెరికన్ నౌకల ఫిరంగుల ధాటికి కమ్యూనిస్టులు నిలవలేకపోయారు. వెంటనే అమెరికన్ సేనలు దిగి సోల్ నగరాభిముఖంగా నాలుగు మైళ్ళు వెళ్లి స్థావర మేర్పరచుకొన్నాయి.

క్రమంగా రెండు రోజుల్లో అమెరికన్ సేన సోల్ నగరంపైకి మూడు దిశలనుంచి దండయాత్ర ప్రారంభించింది. సోల్ నగరానికి పోయే రహదారిలో తప్ప మిగతా దిశల కమ్యూనిస్టులు ఎదిరించలేదు. చచ్చిన వారు చావగా మిగిలినవారు సోల్ నగరాభిముఖంగా పారిపోయారు.

సోల్ నగరం కమ్యూనిస్టులకు ఆయువుపట్టువంటిది. దక్షిణాన రణ రంగాలలో కమ్యూనిస్టు సేనలకు సప్లైలు చాలావరకు ఈనగరం ద్వారానే పోవాలి. దక్షిణ కొరియాలో ఇది ముఖ్య రైల్వేకేంద్రం. ఇది అమెరికన్ సేనల వశమైనట్లయితే ఉత్తర కొరియా రణరంగంనుంచి వేరు పడిపోయినట్లే. దక్షిణరణరంగంనుంచి కమ్యూనిస్టు సేనలు పారిపోదలచుకున్నప్పటికీపారిపోలేవు.

కొరియన్ కమ్యూనిస్టులు 38 వ అక్షాంశపు సరిహద్దును దాటి దండయాత్ర ప్రారంభించగానే మొట్టమొదట వారివశమైనది కింపో విమానాశ్రయం. దానినే అమెరికన్ సైమానికులు మొట్టమొదటగా స్వాధీనపర్చుకున్నారు. దీనితో కమ్యూనిస్టులకు ఆయువు పట్టువంటి విమానాశ్రయం కూడా పోతున్నది. దక్షిణరంగంలో కమ్యూనిస్టుల్ని ఎదిర్చి అమెరికన్ సేనలు నిలదొక్కుకో



గలిగాయి. కమ్యూనిస్టులు ఎంత బలాన్ని ప్రయోగించినా మాసాన్, టెగూ, వైగ్వాన్, యాంగ్‌చాన్, రక్షణపరిధిని ఛేదించలేక పోయారు. ఈ పరిధిని తూర్పు కొసనున్న, పొహాంగ్ రేవును కమ్యూనిస్టులు వశపరుచుకున్నప్పటికీ, టెగూ నగర శ్రేణిని అప్పుడప్పుడు ఛేదించినప్పటికీ అమెరికన్ సేనలు ఈమారు వెనుకంజవెయ్యకుండా నష్టాలకోర్చుకొని నిలబడినాయి. కమ్యూనిస్టులు ప్రయోగించగలిగినంత బలాన్ని అంతా ప్రయోగించారు.

అదేరీతిగా దక్షిణ రణరంగంలో మరికొన్నాళ్లు పోరాటం జరిగినట్లయితే అమెరికన్ సేనలు అదనంగారాకుండా ఉన్నట్లయితే, క్రమక్రమంగా కమ్యూనిస్టులు టెగూ నగరానికి ముప్పుకలిగించేవారే. ఆకారణం వల్లనే కమ్యూనిస్టుసేనల్లో కొంత భాగాన్ని టెగూ రణరంగంనుంచి మరల్చడానికీ, వారికి సప్లైలు అందకుండా చెయ్యడానికీ ఇంచోన్ దండయాత్రజరుపబడింది. దీనివల్ల అమెరికన్ సేనలకు టెగూవద్దనూ, పొహాంగ్—పూసాన్ రహదారి పైనా కమ్యూనిస్టు ముప్పు తప్పిపోవచ్చును.

సోల్ నగరాన్ని వారంలో పట్టుకోగలరని అమెరికన్ సైనికాధికారులు భావిస్తున్నారు. సోల్ నగరం అమెరికన్లకు పట్టుబడినట్లయితే కమ్యూనిస్టులకు ఈయుద్ధంలో పరాజయం ఆసన్నమైనట్లే. దక్షిణ రణరంగంలోకూడా కమ్యూనిస్టుల ఒత్తిడి క్రమ క్రమంగా తగ్గుతున్నది. క్రమంగా అమెరికన్లు నక్టాంగ్ నదినిసమీపిస్తున్నారు. నక్టాంగ్ నదిని దాటి అమెరికన్ సేనలు ఉత్తరంగా టేజాన్ నగరంపైకి దాడి చెయ్యడానికి వ్యూహం పన్నాయి. దీనితో కొరియన్ యుద్ధంలో కొత్త ఘట్టంప్రారంభమౌతున్నది.

ఇంక అతి శీఘ్రంలోనే విజయం తథ్యమని అమెరికన్లు భావిస్తున్నారు. సోల్‌నగరంపై దాడిచేస్తున్న సేనలు దక్షిణానికి గాని, ఆగ్నేయదిశగాగాని వెళ్ళి దక్షిణ రణరంగంలో పోరాడుతున్న కమ్యూనిస్టులను వెనుకనుంచి తాకవచ్చును. చాలినంత బలమున్న పక్షంలో ఉత్తరంగా 38 వ అక్షాంశపుసరిహద్దును సమీపించవచ్చును.

అమెరికన్ సేనలు ఈ సరిహద్దునుదాటి ఉత్తరకొరియాపై దండయాత్ర జరపడానికి సన్నాహం చేస్తున్నాయి. ఆ దండయాత్ర ఎప్పుడు జరిపేదీ ఇంకా తెలియదు. కాని దీనిపై భద్రతామండలి అభిప్రాయాన్ని తెలుసుకోడానికి ప్రయత్నం జరక్కపోవచ్చును.

## భద్రతామండలి *

భద్రతామండలిలో వ్యవహారాలకు ఒక విధంగా ప్రతిష్టంభన ఏర్పడిందని చెప్పాలి. ఉత్తరకొరియా ప్రభుత్వంపై తిరిగి దోషారోపణ చేస్తూ, ఏ దేశమూ ఆ ప్రభుత్వానికి సహాయంచెయ్యరాదని సూచిస్తూ అమెరికన్ ప్రతినిధి ప్రవేశపెట్టిన తీర్మానాన్ని రష్యా వీటోప్రయోగించి కొట్టేసింది. కొరియాలోనుంచి విదేశసైన్యాలు తొలగి పోవాలని సూచిస్తూ రష్యాప్రతిపాదించిన తీర్మానాన్ని భద్రతామండలి సభ్యులు అధిక సంఖ్యాకులు త్రోసివేశారు. మంచూరియాపై అమెరికన్ విమానాలు దాడిచేసి, నష్టంకలిగించిన విషయాన్ని చర్చించడానికి చీనా కమ్యూనిస్టు ప్రభుత్వప్రతినిధిని ప్రవేశపెట్టాలని రష్యాచేసిన ప్రతిపాదన ఏడు వోట్లులభించనందువల్ల వీగిపోయింది. ఈ సందర్భంలో రష్యాప్రతిపాదనకు భారతదేశం, బ్రిటన్, నార్వేలు అనుకూలంగా వోటుచేశాయి. కాని ప్రయోజనం లేకపోయింది.

చీనాచేసిన ఫిర్యాదును విచారించడానికి చీనా ప్రతినిధుల అభిప్రాయం తెలుసుకోడానికి నిరాకరించిన అమెరికన్ ప్రభుత్వ వైఖరి అనేకదేశాల విమర్శలకు గురైంది. ప్రపంచశాంతి సంరక్షణ గురించి నిర్లక్ష్యంతో, కేవలం పగసాధించడమే పనిగా పెట్టుకుంది అమెరికా. ఈ సత్యం నానాటికీ లోకానికి స్పష్టమౌతున్నది. పగకోసం న్యాయాన్ని విసర్జించింది.

ఇంతేకాదు. లోకంలో కల ఆర్థికసంక్షోభాన్ని గమనించకుండా వస్తువుల ధరలు పెరిగిపోతున్నప్పటికీ లక్ష్యపెట్టడంలేదు. ముడివస్తువులనమ్మేదేశాలను మాత్రం తమ అదుపులో పెట్టుకోడానికి యత్నిస్తున్నారు.

అట్లాంటిక్ రాజ్యాల యుద్ధసన్నాహాలు వేగంగా జరుగుతున్నాయి. అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి విదేశాంగ మంత్రులు న్యూయార్కులో సమావేశమై ఈరక్షణ సన్నాహాలను గురించి కొన్ని నిర్ణయాలు చేసుకున్నారు. ఈనిర్ణయాలను అట్లాంటిక్

మనదేశం :

# 56-వ కాంగ్రెస్ సమావేశం ★

56-వ కాంగ్రెస్ సర్వసభ్యసమావేశం ప్రారంభమయింది. ఎప్పటివలెనే బ్రహ్మాండమైన సన్నాహాలు జరిగాయి. ప్రతి సమావేశంలోనూ క్రమం తప్పకుండా పాల్గొంటున్న డా|| రాజేంద్రప్రసాద్ రిపబ్లిక్ అధ్యక్షులైనందువల్ల ఈమారు సమావేశానికి రాలేదు. ప్రప్రథమంగా ఆంధ్రదేశంనుంచి సమావేశానికి (అయిదుమంది మినహా) ప్రతినిధులు లేరు.

కార్యవర్గం మొదటిదినం ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గసభ్యుల విజ్ఞప్తిని పరిశీలించింది. తమ పూర్వనిర్ణయాన్ని పునః చర్చించవలసిన అగత్యం లేదని నిర్ణయించింది. రంగాగారు ఈ నిర్ణయానికి కట్టుబడి ఉండడానికి అంగీకరించారు.

కొత్త అధ్యక్షులు టాండన్‌గారి అధ్యక్షత క్రింద కార్యవర్గం ఆదివారంనాడు సమావేశమై అయిదు తీర్మానాలు చేసింది. వీనిలో కొందరు నాయకుల మృతికి సంతాపసూచకంగా చేసిన తీర్మానం ఒకటి. విదేశాంగవ్యవహారాలలో భారత ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాన్ని ఆమోదిస్తూ ఒక తీర్మానం చెయ్యబడింది. భారతదేశంలోని ఫ్రెంచి, పోర్చుగీస్ పరిపాలిత ప్రాంతాలనుగురించి ఒక తీర్మానం, అస్సాంభూకంపం గురించి ఒక తీర్మానం ఆమోదింపబడినాయి. సోమవారం సమావేశంలో మతవర్గాలపట్ల భారత ప్రభుత్వ విధానం ఆమోదించబడింది.

కాంగ్రెస్ సంస్థనిర్మాణాన్ని తిరిగి సంస్కరించడానికి విచారణనిమిత్తం ఒక సబ్ కమిటీని నియమిస్తూ ఒక తీర్మానం చెయ్యబడింది. రాదల్చినవారందరినీ కాంగ్రెస్‌లో ప్రాథమికసభ్యులుగా చేర్చుకోవచ్చుననే నియమంవల్లనే ఈ సంవత్సరం కాంగ్రెస్ పంచాయతీ ఎన్నికల్లో ఇంత రభస వచ్చిందని భావించి, తిరిగి పూర్వపద్ధతిని పావలాసభ్యత్వం ఏర్పాటుచేసే విషయమై ఈ సబ్ కమిటీ ఒక తీర్మానాన్ని తయారుచేస్తుంది. ఈ తీర్మానాన్ని కార్యవర్గం ఆమోదించి 1950 నవంబరులోగా ఏ. ఐ. సి. సి. సభ్యులకు సంస్కరణవిధానాన్ని తెలుపుతుంది. ఈ సంస్కరణల్ని ఏ. ఐ. సి. సి. తరువాత చర్చిస్తుంది. ఈ సంస్కరణల్లో కార్యవర్గానికి అధిక అధికారాల్ని ఇచ్చే యత్నం జరుగుతుంది.

రాబోయే ఎన్నికలనిమిత్తం కాంగ్రెస్ అభ్యర్థుల్ని ఎవరు ఎలా ఎంచాలి అనే విషయంపైన కూడా కొన్ని సూచనలు చేయబడతాయి. అయితే ఈ విషయమై కార్యవర్గంలో ఏకాభిప్రాయం కుదరలేదు.

## సవరణలవల్లప్రయోజనం?

వాస్తవానికి ఈ సవరణలవల్ల ఏం ప్రయోజనం కలుగుతుందో బోధపడదు. పావలా సభ్యత్వానికీ ప్రాథమిక సభ్యత్వానికీ భేదం లేదు. పావలా సభ్యత్వం కల రోజుల్లోకూడా ఇప్పుడున్న మాదిరిగానే అక్రమాలు జరిగాయని చెప్పబడింది. పశ్చిమ గోదావరిజిల్లాలో ధనవంతులైనవారు ముందుగా పెద్ద మొత్తంలో డబ్బు కట్టేసి, తమకు అనుకూలురైనవారిని అందరినీ (వారి అనుమతితోను, అనుమతి లేకుండాను కూడా) పావలాసభ్యులుగా చేర్చేసినట్లు ఇదివరలో ఆరోపించబడింది ఈ మారురుసుము చెల్లించనక్కర్లేని ప్రాథమికసభ్యత్వాలు లక్షలాది వరదలుగా వచ్చిపడితే, రూపాయిరుసుము కట్టవలసిన అర్హతా సభ్యత్వాలు వేనవేలు వొచ్చిపడ్డాయి. అందువల్ల పావలాసభ్యత్వం రూపాయి సభ్యత్వాలతో తీరిపోయేదికాదీ సమస్య అని తేలుతున్నది. చేరిన సభ్యులందరూ నిఖార్సైన కాంగ్రెస్‌వారా కాదా అని విచారించేముందు కాంగ్రెస్ కార్యకర్తలకు కాంగ్రెస్‌పట్ల ఎటువంటి శ్రద్ధఉన్నదో కనిపెట్టాలి. వారివారి అభిప్రాయాలు, నడవడి, రాజకీయాశయాలు, వృత్తి మొదలైనవానిని గమనించకుండా అడ్డమైనవారినీ సభ్యులుగా చేర్చగలుగుతున్న కార్యకర్తల్ని కనిపెట్టగలగాలి. కాని ఇంత మహాసంస్థలో ఇది కనిపెట్టడమూ కష్టమే. కనిపెట్టినా వారి నేమీ అనడానికి వీల్లేని పరిస్థితి. ఏ ఒక రిద్దరో మినహా కార్యకర్తలందరూ పోటీపడి ఈరీతిగా సభ్యత్వాల్ని పెంచేస్తుంటే కార్యకర్తలందర్నీ తొలగించగలరా? అసలు తొలగించేవా రెవరు? అక్రమాలు నిర్ణయించేవా రెవరు? బాధ్యులైనవారే తమ తమ అనుకూలాల ప్రకారం ఈకార్యాలను చేస్తుంటే ఎవరిని ఎవ రేమనగలరు?

అందువల్లనే మళ్ళీ పావలాసభ్యత్వాలు వచ్చినా పరిస్థితి మారదని శంకించవలసివస్తున్నది.

అదేరీతిగా వచ్చే ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థుల్నెంచే విషయంకూడా అభ్యర్థుల్ని ఎంచే కర్తవ్యాన్ని స్థానిక కాంగ్రెస్ కార్యకర్తల కొప్పగించే కంటె ఒక ప్రత్యేక కమిటీని ఏర్పరచడం మంచిదని, హరికృష్ణ మెహతాబ్‌గార్లు అభిప్రాయపడుతున్నారు. కాంగ్రెస్ కార్యకలాపాలకూ అభ్యర్థులను ఎంచడానికీ సంబంధంఉండరాదని పండిట్ నెహ్రూ అభిప్రాయం. కాని ప్రస్తుతవిధానాన్నే అనుసరించడం మంచిదనీ, అభ్యర్థుల్ని ఎంచేనిమిత్తం వేరే కమిటీని పెడితే అది కాంగ్రెస్‌సంస్థకే హాని కలిగించగలదనీ సర్దార్ పటేల్ కార్యవర్గ సమావేశంలో తమ అభిప్రాయం ప్రకటించారట.

రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుని, రాష్ట్ర ముఖ్య మంత్రినీ, కేంద్రకాంగ్రెస్‌వారు నియమించే ఒక సభ్యునీ మొత్తం ముగ్గురినీ చేర్చి రాష్ట్రాలలో అభ్యర్థులను ఎంచే కమిటీలుగా నియమించడం మంచిదని కొందరు సూచించారట. దీనివల్ల రాష్ట్రకాంగ్రెస్‌కమిటీలకూ మంత్రివర్గాలకూ విరోధం ఏర్పడిన చోటెల్ల నిష్పక్షపాతంగా అభ్యర్థుల్ని ఎంచవచ్చునని వీరి అభిప్రాయం.

ఈ విషయమై పరిశీలన చేసి ఒక తీర్మానాన్ని తయారుచేయటానికిగాను రాజగో

---

కౌన్సిల్ పరిశీలిస్తున్నది. అయితే ఈకౌన్సిల్ అగ్రరాజ్యత్రయ నిర్ణయాలను ఆమోదించక పోవడమనేది లేదు. జర్మనీలో సైన్యదళాల నిర్మాణంగురించి ఇంకా నిర్ణయాలు జరగలేదు. మొత్తానికీసన్నాహాల ఫలితంగా ప్రపంచమంతటా వస్తువులధరలు పెరుగుతూవున్నాయి. ఈ పెరుగుదలవల్ల ఆర్థికంగా అమెరికా బ్రిటన్‌లపై ఆధారపడివున్న అన్యదేశాలన్నిటా మాత్రం దుర్భిక్షం వ్యాపిస్తున్నది. [సూర్యనారాయణ]

పాలాచారి, పండిట్ గోవింద వల్లభపంత్, యస్. కె. పాటిల్, హరికృష్ణ మెహతాబ్ ప్రభృతులతో ఒక సబ్ కమిటీని నియమించారు.

అయితే ఏ మార్పులు చేసినప్పటికీ ప్రయోజనం ఎంత ఉండగలదో సందేహమే.

ఈనాడు కాంగ్రెస్ నాయకుల వ్యవహారాలు, కార్యకర్తల చర్యలు ఏ నిర్మాణ కార్యక్రమానికీ సంబంధించినవి కావు.

నిర్ణీత ఆర్థిక సాంఘిక జాతీయ కార్యక్రమాలు, ప్రణాళికలను బట్టి ఆయా రాజకీయపక్షాల మధ్య వ్యత్యాసాలు వుంటాయి. ఒక్కొక్క రాజకీయపక్షానికి ఆశయాలను బట్టి కార్యక్రమాలను బట్టి ఒక విశిష్టత, ప్రత్యేక లక్షణాలూ ఉంటాయి. కాంగ్రెస్ కికూడా అటువంటివి లేకపోలేదు. కాని సంస్థలో సర్వగోత్రీకులూ చేరి విశిష్టత లేకుండా అసలు కార్యక్రమమే లేకుండా చేసేశారు. కాంగ్రెస్ ఈనాడు ఒక రాజకీయపక్షం కాదు. ఒక జాతీయ సంస్థ కాదు. ఒక ఆదర్శం కాదు. అన్ని రకాల రాజకీయాలూ, అన్నిరకాల జాతీయలక్షణాలు, అంతర్జాతీయ లక్షణాలు, జాతి అతీత లక్షణాలు, అన్నిరకాల ఆదర్శాలు కలబోసి కలగూరగంపగా తయారయింది. కాబట్టి ఏ ఆదర్శానికీ, ఏవిశిష్ట లక్షణానికీ తావు లేకుండా పోయింది.

కాంగ్రెస్ రాజకీయాల్లో కూడా అన్ని రకాలూ ఉన్నాయి. పార్లమెంటరీ రాజకీయాలు, నియంతృత్వపక్షాలు, ప్రజాస్వామ్యతత్వాలు, అరాచకవాదులు, ప్రజాస్వామ్యవాదులు, సామ్యవాదులు, మతానురక్తులు, మతద్వేషులు, ఏకభాషావాదులు, బహుభాషావాదులు, ప్రాంతీయాభిమానులు, భాషారాష్ట్రవాదులు, భాషారాష్ట్రవాదసంహారకారులు సర్వగోత్రీకులూ చేరి రణగొణధ్వని చేసి కాంగ్రెస్ ని అన్ని దిశలకీ లాగుతున్నారు.

జాతికంతకీ ఏకైకసంస్థ కావాలనే ఆత్రంలో కాంగ్రెస్ నాయకులు క్రమక్రమంగా సభ్యత్వసంఖ్యాభివృద్ధికోసం ఆదర్శాల్ని ద్వితీయంగా పరిగణించారు. సర్వగోత్రీకుల్నీ చేతులు చాచి ఆహ్వానించారు. దేశం ఏమైనా సరే, ప్రజలేమైనా సరే స్వలాభం ప్రధానమని భావించేవారికి ఏకష్టం లేకుండా కాంగ్రెస్ లో ప్రవేశం లభించింది.

**సభ్యత్వ సంఖ్యాధిక్యతకోసం తహతహ లాడినందువల్లనే నేడీ విషమపరిస్థితి సంభవించిందనే విషయాన్ని ఈనాటికీ కాంగ్రెస్ నాయకులు గుర్తించలేకుండా ఉన్నారు.**

తమ ఆదర్శాల బలంవల్ల, తమ పరిపాలనా విధానంవల్ల ప్రజల ఆదరణను పొందాలని యత్నించడానికి బదులు, ఎవరివోట్లు కోరుతున్నారో వారి నందరినీ (వీలైతే వోటర్ల లిస్టులో పేర్లు కలవారినందరినీ) సంస్థ అనే బోటులో కెక్కించేశారు. ఈ పద్ధతి మారితే గాని సంస్థనిర్మాణంలో ఎన్ని మార్పులు తెచ్చినా, నియమాల నెన్నిమార్లు సవరణ చేసినా ప్రయోజనం ఉండదు.

టాండన్ గారి ఎన్నికతో మత ప్రధాన రాజకీయవాదుల బలం పెరిగిందని పండిట్ నెహ్రూ అన్నారు. కాని సర్వవిషయాలలోనూ, భారత-పాకిస్తాన్ వ్యవహారాలలోనూ, భారతదేశంలోని మహమ్మదీయుల పట్ల వ్యవహారాలలోనూకూడా పండిట్ నెహ్రూ అవలంబిస్తున్న విధానాన్ని బలపరచగలరని టాండన్ హామీ నిచ్చారు. విదేశాంగ వ్యవహారాలు, ఆర్థిక మత వర్గాల వ్యవహారాలలో కాంగ్రెస్ ఏ విధానాన్ని అవలంబిస్తుందో స్పష్టపరచాలని పండిట్ నెహ్రూ అడిగారు. పండిట్ నెహ్రూ ప్రకటనవల్ల ఒక ప్రయోజనం మాత్రం కలిగింది. జయపూర్ కాంగ్రెస్ నిర్వచించిన విధానాన్నే మార్పు లేకుండా అనుసరించడానికి టాండన్ వర్గం వారు నిర్ణయించుకున్నారు. కాంగ్రెస్ అగ్రనాయకుల్లో విభేదాలు పైకి ఉబకకుండా లోలోనే ఉండిపోయినాయి. కాంగ్రెస్ కార్యకర్తలలో కొన్ని వర్గాల వారికి తాము కోరేవిధానం ప్రజలకు అంగీకారయోగ్యంగా ఉండదని తెలుసును. కాబట్టే పండిట్ నెహ్రూ ప్రకటనతో అందరూ ప్రభుత్వ విధానాన్ని ఆమోదించారు. అయితే ఇదెంత కాలం కొనసాగుతుంది?

నాసిక్ కాంగ్రెస్ ఈ సమస్యల్ని పరిష్కరించడం లేదు. కాబట్టి నియమాలలో ఎన్ని సవరణలు తెచ్చినా దేశంలో కాంగ్రెస్ రాజకీయాలు నూరగలవనే ఆశ ఎవరికీ లేదు. [సీతారామ్]



# బదరీనారాయణ క్షేత్రం



హిమాలయంలోని కేదారనాథుని ఆలయం



బదరీనారాయణ క్షేత్రం—గ్రామం



బదరీ నారాయణంలోని దేవాలయం



బదరీ నారాయణ ఆలయంలో యాత్రికులు.

Regd. No. M. 4479

ఉత్తమ శైవమత గ్రంథము

# పండితారాధ్యచరిత్ర

పాల్కురికి సోమనాథకవి రచించిన ఉత్తమ ద్విపద కావ్యము. డా. చిలుకూరి నారాయణరావు గారిచే పరిష్కరింపబడినది. దీక్షా, పూజా, వాద, మహిమ, పర్వతములను అయిదు ప్రకరణములును ఒకే సంపుటమున గలవు. ఇంత నిర్దుష్టముగ ఈ గ్రంథము నిదివర కెవ్వరును ప్రచురించి యుండలేదు. నారాయణరావుగారు రచించిన అమూల్యమైన పీఠికకూడ గలదు.

**వెల రు 5-0-0 లు.**

ప్యాకింగు పోస్టేజి రూ. 1—4—0.

## ఆంధ్ర గ్రంథమాల,

**పోస్టుబాక్సు 212, మదరాసు 1.**

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madra-